# Create your own Toons!!







Colouring has never been so much of fun.
And now there's more...
Mix 'n Match and create your own Toons with the New Funfaces sticker free along with every pack of

Reynolds™

ARTOONS™

Long Colouring Pens

Fun Strokes that go on and on

# చందమామ

సంపుటి 102 జనవరి 2000 సంచిక 1




ఈ సంచికలో...

కథలు



ఈ నెల విశేషాలు



రాక్షసధర్మం (బేతాళ కథ)



భారత సంస్కృతి-చరిత్ర

పాల్గొనండి బహుమతులు గెలుచుకోండి!




Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి!



వారి భాషలో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతి, హిందీ, కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకి
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు,
ఆరు సంచికలు రూ. 300
పన్నెండు సంచికలు రూ. 500

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారాగాని చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి.

PUBLICATION DIVISION
**CHANDAMAMA INDIA LIMITED**
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600026


సంపాదకుడు
విశ్వం
డిజైన్ & సాంకేతిక
సలహాదారుడు
ఉత్తమ్
ప్రచురణకర్త
బి. విశ్వనాధరెడ్డి
డైరక్టర్ మార్కెటింగ్
వి. మధుసూదన్



ముఖ్య కార్యాలయం
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్-600 026
ఫోన్: 4841778, ఫ్యాక్స్: 4835298

ఇతర కార్యాలయాలు

భువనేశ్వర్
116-బి, బి.డి.ఎ, డ్యూప్లెక్స్ హౌస్,
బారముండ, భువనేశ్వర్-751 003
ఒరిస్సా. ఫోన్:455 0534

ఢిల్లీ
ఫ్లాట్ నం. 415, 4 ఫ్లోర్
ప్రతాప్ భవన్
5, బహదుర్‌షా జఫర్ మార్గ్
ఢిల్లీ-110 002 ఫోన్: 2270199

ముంబాయి
2/B నాజ్ బిల్డింగ్స్,
లామింగ్‌టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్:3889763-3886324-3877110
ఫ్యాక్స్:3889670

సంచాలకులు
చక్రపాణి, బి. నాగిరెడ్డి

# ఆశాజనక తరుణం!

ప్రపంచ వ్యాప్తంగా కొత్త ఆశలు, అపేక్షలు ఉరకలు వేసే వాతావరణం నెలకొని ఉన్నది. మనం ఇప్పుడొక ఉద్వేగభరితమైన కాలఘట్టంలో ఉంటున్నాం. నూతన శతాబ్దానికే కాదు; నూతన సహస్రాబ్దానికే ఇది ఆరంభసమయం. ఇది మనలో సంరంభం కలిగించడంలో ఆశ్చర్యంలేదు.

2000వ సంవత్సరాన్ని 20వ శతాబ్దానికి ఆఖరి సంవత్సరంగా తీసుకోవాలా? లేక 21వ శతాబ్దానికి మొదటి సంవత్సరంగా భావించాలా? అన్న విషయం గురించి ఇంకా ఒకవైపు తర్జన భర్జనలు జరుతూనే ఉన్నాయి. ఏది ఏమైనా, ఈ కొత్త సంవత్సరాన్ని రెండు శతాబ్దాలకు మధ్య వంతెన అని చెప్పవచ్చు.

కొత్త ఆశలతో ఈ కొత్త శతాబ్దినీ, సహస్రాబ్దినీ ఎదురుచూడడంలో ఏదైనా ప్రాముఖ్యత ఉన్నదా అంటే ఉన్నదనే చెప్పాలి. మన ఆశలు మరింత మంచికోసం; మన అపేక్ష మరింత ప్రకాశవంతమైన భవిష్యత్తుకోసం! 20వ శతాబ్దంలో మనిషి ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొన్నాడు. వాటిలో కొన్ని–ప్రపంచ యుద్ధాలు, భారత విభజన వంటివి మనుషులే సృష్టించుకున్నవి. మరికొన్ని–ఇటీవల ఒరిస్సాతీరాన్ని అతలాకుతలం చేసిన తుపానుల్లాంటివి, భూకంపాలు ప్రకృతి సిద్ధంగా వచ్చిపడినవి. అయితే మానవజాతి ఈ శతాబ్దంలో మరికొన్ని మహత్తర ఆశయాలను కూడా సఫలం చేసుకున్నది. సుస్థిరమైన ఐక్యరాజ్యసమితి ఏర్పాటు; అణుబాంబులను నిర్మూలించడానికి ఏకాభిప్రాయసాధన వంటివాటిని వీటిలో ముఖ్యంగా చెప్పుకోవచ్చు. భూకంపాలు, తుపానులు వంటి ఉత్పాతాలు ముంచుకు వచ్చినప్పుడు బాధితులకు ఎక్కడెక్కడి నుంచో సానుభూతి, సహాయ సహకారాలు అందడం ఎంతయినా ఆనందించి, అభినందించతగ్గ విషయం.

రానున్న కాలంలో మరింత ఉన్నతమైన, మేలైన సమైక్య మానవజాతి రూపొందగలదని ఆశిద్దాం!



# చందమామ కబుర్లు

## మునిగిపోయిన ద్వారక అవశేషాలు!

శ్రీకృష్ణుడు పడమటి సముద్రతీరంలో (ఇప్పటి గుజరాత్) ద్వారకానగరాన్ని నిర్మించాడని పురాణాలు పేర్కొంటున్నాయి. ఆయన అవతారం చాలించాక ద్వారక కూడా సముద్రంలో మునిగిపోయింది!

ప్రముఖ భారతీయ సముద్ర భూతత్వ శాస్త్రవేత్త డా॥ ఆర్.స్.రావు ఈ ప్రదేశంలో తవ్వకాలు జరిపి చాలా పరిశోధనలు చేశాడు. దాదాపు మూడు వేలా ఏడు వందల సంవత్సరాలకు పూర్వం ప్రాచీన కుశస్థలీ ద్వీప శిథిలాల మీద ఈ నగరం నిర్మించబడిందనీ, అయితే వంద సంవత్సరాలకే దానిని సముద్రం



కబళించివేసిందనీ ఆయన అభిప్రాయపడుతున్నాడు. ఈ ఉత్పాతం జరగడానికి వారం రోజులు ముందుగానే అక్కడి వారు మరో చోటికి తరలి వెళ్ళడానికి శ్రీకృష్ణుడు ఏర్పాటు చేశాడు. భూమి పునర్గ్రహణ విధానంలో అంటే ఇప్పుడు కూడా ఉపయోగంలో వున్న 'ల్యాండ్ రిక్లమేషన్ టెక్నాలజీ'లో శ్రీకృష్ణుడు ఈ నగరాన్ని నిర్మించి వుండవచ్చని డాక్టర్‌రావు అభిప్రాయపడుతున్నాడు! ఆర్థికనిధుల కొరత వల్ల తవ్వకాల పనులు ఆగిపోయాయి. ఈ ప్రణాళికను బి.బి.సి. త్వరలో ఫిలింగా తీయనున్నది.

## ఎక్కువ దూరం నడిచిన అతిపెద్ద వయస్కుడు!

జోర్డాన్‌కు చెందిన ఘరీర్ అనే వృద్ధుడు 128వ యేట మరణించాడు. ఆయన చివరిరోజులలోనూ ఎక్కడికైనా సరే నడిచేవెళ్ళేవాడు. ఆయన యువకుడుగా ఉన్నప్పుడు జోర్డాన్ స్థాపకుడు రాజు అబ్దుల్లా నడిపిన గుర్రాల, ఒంటెల పందాలలో పాల్గొనేవాడు.



తీపి తినుబండారాలన్నా, మంచి భోజనం అన్నా ఆయనకు ఎంతో ఇష్టం. ఆయనకు ఇప్పుడు 128 మంది మనవలూ, మనవరాళ్ళూ; మునిమనవలూ, మునిమనవరాళ్ళూ ఉన్నారు.

## భూమిపై నడిచిన అతిపెద్ద జంతువు

అమెరికాలోని ఓక్లహోమా విశ్వవిద్యాలయానికి చెందిన రిచర్డ్ సిఫేలీ అనే నిపుణుడు తన బృందంతో కలిసి ఆగ్నేయ ఓక్లహోమాలో కొన్ని పరిశోధనలు జరిపాడు. వాళ్ళకు ఒక డైనోజార్ శిలాజం కంటబడింది. అది ప్రాణంతో ఉన్నప్పుడు 60 టన్నుల బరువూ; భవనంలో ఆరో అంతస్థును అందుకోగల అతి పెద్ద మెడతో 60



అడుగుల ఎత్తూ ఉండి ఉంటుందని భావిస్తున్నారు. నడుస్తూంటే భూమిని దద్దరిల్ల జేసిన రాక్షసబల్లి అని దానికి పేరు పెట్టారు. "అది చాలా ఆశ్చర్యకరమైనది. భూమిపై నడిచిన అతిపెద్ద జంతువు అదే అని చెప్పవచ్చు!" అంటున్నాడు రిచర్డ్ సిఫెలీ!

## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

# స్వామి వివేకానంద

### భారత పునరుజ్జీవ శంఖారావం



చట్టవిద్య చదువుతున్న కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రుడొకడు తరచూ శ్రీరామకృష్ణ పరమ హంసను చూడడానికి వస్తూండేవాడు. ఆ యువ కుడు పరమహంసతో మాట్లాడే తీరు చూసిన కొందరు, అతనిలో ఎప్పటికీ వివేకం ఉదయిం చదని భావించి ఉండవచ్చు. ఎందుకంటే—అతడు ఆధ్యాత్మిక విషయాలను పక్కన పెట్టి, వాదోప వాదాలకు దారితీసే ప్రాపంచిక విషయాలకు సంబం ధించిన ప్రశ్నలనే ఎక్కువగా అడిగేవాడు.

పరమహంస అపార కరుణ ఆ యువకుణ్ణి గొప్ప ఆధ్యాత్మిక ప్రవక్తగా మార్చ గలదనీ; నరేంద్రనాథ్ దత్తా అనే ఆ యువకుడు, నవ భారత పున రుజ్జీవానికి శంఖారావం చేసిన స్వామి వివేకానందగా జగత్ ప్రసిద్ధి చెందగలడనీ వాళ్ళకు అప్పుడు తెలియదు!

స్వామి వివేకానంద 1863 వ సం॥ జనవరి 12వ తేదీన జన్మించాడు. శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యుడై సన్యాసం స్వీక రించాడు. ఆయన సన్యాసం స్వీకరించాడే తప్ప—చుట్టూ వున్న ప్రపంచాన్నీ, అజ్ఞానంతో అలమటించే దీనమానవులనూ మరువలేదు. దేశాన్ని గురించి ఆలోచించడం వదిలిపెట్టలేదు. దీనజనులలో నిద్రాణంగావున్న దేవుణ్ణి సందర్శించాడా మహ నీయుడు!

1886వ సం॥లో శ్రీరామకృష్ణ పరమహంస పరమపదించారు. 1893వ సం॥లో స్వామి వివేకానంద అమెరికాలో జరిగిన విశ్వమత మహాసభలో పాల్గొన్నాడు. భారతీయ తత్వశాస్త్రమైన వేదాంతం గురించి అనర్గళంగా ఉపన్యసించి శ్రోతల హృదయాలను ఉర్రూతలూగించాడు. అక్కడి నుంచి ఇంగ్లాండుకు వెళ్ళాడు. ఆ రెండు దేశాల లోనూ పలువురు ఆయన శిష్యులయ్యారు.

భారతదేశానికి తిరిగివచ్చి ఆయన శ్రీరామకృష్ణ మిషన్‌ను స్థాపించాడు. ఆ సేతు హిమాచలం పర్య టించాడు. అద్భుతమైన ఉపన్యాసాల ద్వారా వేలాది మంది యువతీ యువకులను దేశ సేవకోసం ప్రేరేపించి ఉత్తేజితులను చేశాడు. జీవిత పరమార్థం గురించి మన సనాతన ఋషులు కనుగొని వెలిబుచ్చిన యోగరహస్యాలను విపు లీకరిస్తూ అనేక పుస్తకాలు రాశాడు.

తన జాతికి మరణాన్ని జయించే వారసత్వాన్ని అందజేసిన స్వామి వివేకానంద నలభైయేళ్ళు నిండకముందే 1902వ సం॥లో అమరుడయ్యాడు. ఆయన అంటాడు:

"భిన్నత్వంలో ఏకత్వమే విశ్వసృష్టి రహస్యం. మానవులుగా మనమందరం ఒక్కటే. అయినా ఒకరికీ మరొకరికీ తేడా వుంది. మానవ జాతిలో అంతర్భాగంగా నేను మీలో ఒక్కణ్ణి; నామరూపాలు గల ఫలానా వ్యక్తిగా మీ కన్నా భిన్నమైన వాణ్ణి. పురుషుడిగా నువ్వు స్త్రీకన్నా భిన్నమైనవాడివే. అయినా మనుషులుగా అందరూ ఒక్కటే. మనిషిగా నువ్వు జంతువుకన్నా భిన్నమైనవాడివే. అయినా ప్రాణంవున్న జీవులుగా పురుషుడూ, స్త్రీ, జంతువూ, చెట్టూ, చేమా అంతా ఒక్కటే. సృష్టిలో వున్న ప్రతి ఒక్కరూ పరిపూర్ణ విశ్వంలో కలిసి ఒకటిగానే ఉంటున్నారు!"



# కృతజ్ఞతలు!

చందమామ మళ్ళీ రాబోతుందన్న వార్త పిల్లలకు ఆనందకరమైనదే. అందులో సందేహం లేదు. అయితే, చందమామ పునఃప్రారంభం పట్ల మన పత్రికలు చూపిన ఆసక్తి, ఆదరణ–ఆ సంగతిని ప్రజలకు తెలియజేయడానికి అవి చూపిన ఉత్సాహం మరెంతో ఆనందం కలిగిస్తున్నది. ఆంగ్లంలోనూ, ఇతర భాషలలోనూ పలు ప్రముఖ వార్తాపత్రికలు ఈ విషయం గురించిన వార్తాకథనాలను విపులంగా ప్రచురించాయి. భారతీయ సంస్కృతీ వైభవాన్ని కథలు, పురాణాలు, ఇతర శీర్షికల ద్వారా యువతరానికి తెలియజేసి–నూతన శతాబ్దంలోకి మరింత విశ్వాసంతో ముందడుగు వేయడానికి స్ఫూర్తి కలిగించాలన్న ప్రచురణకర్తల ఆశయాన్ని ఇంటర్వ్యూల ద్వారా బి.బి.సి, దూరదర్శన్ మెట్రో (టీవీ టుడే, ఆజ్‌తక్) ప్రజలమధ్యకు తీసుకు వెళ్ళాయి.

ఆయా పత్రికలకూ, టీవీ సంస్థలకూ మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. చందమామతోపాటు నూతనశకంలో విజయవంతంగా ముందుకు సాగడానికి శుభాకాంక్షలు తెలియజేస్తున్నాం.

అదేవిధంగా చందమామ ప్రచురణ పునఃప్రారంభం అవుతుందని తెలియగానే హర్షామోదాలు తెలియచేసిన అసంఖ్యాకులైన పాఠకులకూ, రచయితలకూ, పంపిణీదారులకూ, ఏజంట్లకూ, శ్రేయోభిలాషులకూ మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

B. Viswanatha Reddi

ప్రచురణకర్త

# సృజనాత్మక పోటీలు



## చందమామ పాఠకులకు ఆహ్వానం

మీ ఊహాశక్తికీ, వివిధ రంగాలలో మీ సృజనాత్మక ప్రతిభకూ పదునుపెట్టే పోటీలలో పాల్గొనండి!





## ఫోటో వ్యాఖ్యల పోటీ

1. ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీకి కావలసిన రెండు ఫోటోలను యువఫోటోగ్రాఫర్లు పంపవచ్చు. రెండు ఫోటోలకూ పరస్పర సంబంధం ఉండాలి. ఆ సంబంధం గురించిన సొంత వివరణ రాసి, తప్పకుండా ఆ ఫోటోలతో జతచేసి పంపాలి.

ఎంపికచేయబడే (రెండు) ఫోటోలకు బహుమతి రూ.500/-

ఫోటోలు ఎప్పుడైనా పంపవచ్చు.



2. మీ పత్రికలో ఒక సామెతను ప్రచురిస్తాం. ఆ సామెతలోని విషయాన్ని వివరించే సంఘటనను గాని, సొంత అనుభవాన్నిగాని, లేదా (కొత్త/పాత) కథనుగాని 300 పదాలకు మించకుండా రాసి పంపాలి. మీరు పంపే రచనలో సామెతలకు సంబంధించిన విషయం ఉండాలే తప్ప ఆ సామెత పుట్టిన కారణం తెలియజేసే అసలు కథను మాత్రం పంపకూడదు అన్న విషయం గుర్తుంచుకోండి.

ఈ నెల సామెత: "అందని ద్రాక్షపళ్ళు పుల్లన"

ఎంపికచేయబడే రచనకు బహుమతి రూ. 500/-

మీ రచనలు జనవరి 31లోగా మాకు చేరాలి.
గెలుపొందిన రచన ఏప్రిల్ నెల సంచికలో ప్రచురించబడుతుంది.
మీ ఎంట్రీలను ఈ చిరునామాకు పంపండి:
చందమామ సృజనాత్మక పోటీలు
చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026

–సంపాదకుడు

బేతాళ
కథలు

# రాక్షస ధర్మం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీలో ఎంతటి కఠోర శ్రమకైనా ఓర్చగల శక్తీ, కోరినదాన్ని సాధించి తీరాలనే పట్టుదలకు కొదువలేదు. ఐతే వీటికి దీటైన తార్కిక దృష్టి, నయవంచకులను ఇట్టే గుర్తించగల సూక్ష్మ పరిజ్ఞానం వున్నవాడన్న విషయం గురించి నన్ను తీరని సంశయం బాధిస్తున్నది. పరిస్థితుల ప్రభావ కారణంగానో, లేక కేవలం అదృష్టం వరించడం వల్లనో లోకంలో కొందరు దిగువ స్థాయి నుంచి పైస్థాయికి ఎగబాకి సుఖాలనుభవించే అవకాశం వున్నది. ఈ లౌకిక సూత్రం మానవులకే



కాదు, రాక్షసులకైనా వర్తిస్తుంది. కాని కొందరు తార్కిక దృష్టినీ, అనుభవ జ్ఞానాన్నీ కూడా విస్మరించి, తమకు పట్టనున్న గొప్ప అదృష్టాన్ని చేజేతులా జారవిడుచు కుంటారు. నీకు ముందు ముందు ఉదాహరణగావుండి, తగు జాగ్రత్తలో వుండేందుకుగాను, దీర్ఘబాహుడనే ఒక రాక్షసుడి కథ చెబుతాను, శ్రమ తెలియ కుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం కుంతల రాజ్యంలో శంకరశాస్త్రి అనే ఒక వృద్ధ పురోహితుడుండేవాడు. ఒకసారి ఆయన దూర గ్రామంలో ఒక సంపన్నుడి ఇంట శుభకార్యం జరిపించి, అక్కడ లభించిన సంభావనలతో తిరుగు ప్రయాణమయ్యాడు. త్వరగా ఇల్లు చేరాలనే ఆలోచనకొద్దీ, శంకరశాస్త్రి అంతగా జనసంచారం వుండని, ఒక అడవి మార్గాన బయలుదేరాడు. అతడు కొంత దూరం వేగంగా నడిచి, ఎత్తయిన చెట్లతోవున్న ఒక పెద్ద గుట్ట పక్కగా పోతున్నంతలో, అక్కడ గుహలో వున్న రాక్షసుడొకడు బాగా చేయి చాచి శంకరశాస్త్రి నడుమును గుప్పెట్లో గట్టిగా బిగించి పైకెత్తాడు.

శాస్త్రి ప్రాణభయంతో విలవిల్లాడిపోతూ తలవంచి చూసేసరికి, ఎదురుగా గుహ లాంటి నోరు, ఆ నోటిలో చురకత్తుల్లాంటి తెల్లటి కోరలతో రాక్షసుడు కనిపించాడు. వాడు శాస్త్రికేసి అయిష్టంగా చూస్తూ, "ఒరే, ఒకప్పుడైతే నీ బోటి జవజీవాలుడిగిన వాణ్ణి ముట్టనైనా ముట్టేవాణ్ణికాదు, కాని ఏం చేసేది? నిన్ను తినక తప్పదురా, బక్క పీనుగా!" అన్నాడు.

రాక్షసుడు తనను చప్పున తినెయ్యా కుండా మాట్లాడడం ప్రారంభించేసరికి, తను ఏవైనా నాలుగు వాడికి సంతోషం కలిగించే మాటలు మాట్లాడి, ప్రాణా పాయం నుంచి బయట పడవచ్చునన్న ఆశ కలిగి శంకరశాస్త్రి, "ఓ రాక్షసేంద్రా! తమరు అద్భుత శక్తి సంపన్నుల్లా కనిపిస్తున్నారు. ఎక్కడో గుట్ట దిగువున కాలిబాట వెంట పోతున్న నన్ను, గుహ సింహద్వారంలో వుండే పట్టి పైకెత్తారు. ఇది దేవమానవులెవరికీ సాధ్యమయ్యేది కాదు. రాక్షసేంద్రులైన తమ బోంట్లకు తప్ప!" అన్నాడు.

ఆ మాటలకు పరమానందం చెందిన రాక్షసుడు, గుహ ప్రతిధ్వనించేలా నవ్వి, "ఒరే, నా పేరు దీర్ఘబాహుడు. పుట్టుకతోనే

వచ్చిన నా అతి పొడవైన చేతులను చూసి నా తల్లిదండ్రులు నాకు దీర్ఘబాహుడు అని పేరు పెట్టారు, చూడు!" అంటూ చేతులను పైకెత్తి దావులనున్న ఒక చెట్టుకొమ్మను విరిచి దూరంగా విసిరి వేశాడు.

శంకరశాస్త్రికి అప్పటికి మరింత ధైర్యం చిక్కింది. ఆయన ఒక పథకం ఆలోచించి, దీర్ఘబాహుడి ముఖంలోకి పరీక్షగా చూస్తూ, "ఓ రాక్షసేంద్రా! కాటికి కాలు జాపిన నాలాంటి వాడు, కారణజన్ములైన నీ లాంటి వాడికి ఆహారమై ఆకలి తీర్చగలిగితే నిజంగా అది వెయ్యి జన్మల పుణ్యఫలమే. కాని, నేనీప్రాంతానికి వచ్చిన పని వేరు. నా పేరు శంకరశాస్త్రి. రాజ్యమంతటా త్రికాలజ్ఞానిగా పేరువెూసిన వాణ్ణి. ముందు నీ జన్మ రహస్యం చెప్పనివ్వు. తర్వాత సంతోషంగా నీకు ఆహారమవుతాను," అన్నాడు.

ఇది వింటూనే దీర్ఘబాహుడు ఆశ్చర్యపోయి, మోకాళ్ళమీద వంగి కూర్చుంటూ, "నాదంటూ ఒక జన్మ రహస్యం వున్నదా! ఏమిటది? త్వరగా చెప్పు," అన్నాడు కుతూహలంగా.

శంకరశాస్త్రి ఒకసారి గట్టిగా గొంతు సవరించుకుని, "రెండు తరాలకు ముందు, ఈ కుంతల రాజ్యాన్ని పాలించిన శూరసింహ మహారాజువు సాక్షాత్తు నువ్వే. ఆనాటి నీ పాలన గురించి కుంతల ప్రజలు ఇప్పటికీ కథలూ, గాథలుగా చెప్పుకుంటున్నారంటే–నువ్వెంత కీర్తిగడించావో ఆలోచించు. అలాంటి నువ్వు, గడ్డుకోపిష్ఠి అయిన ఒక ముని శాపాన బడి, రాక్షసుడిగా జన్మించి, గుహల్లో కటిక నేల మీద పడుకుంటూ ఆకలి చల్లార్చుకునేందుకు నాబోటి బడుగులను పట్టుకుంటున్నావనే, నా కడుపు తరుక్కుపోతున్నది," అన్నాడు బాధ నటిస్తూ.



"అంతగా బాధపడకు బ్రాహ్మడా! నీ వల్ల అంత గొప్పదైన గతం తెలిసినందుకు చాలా సంతోషంగా వుంది! భవిష్యత్తులో కూడా నేనింతేనా, లేక శాపవిమోచన మార్గం ఏమైనా వున్నదా?" అని అడిగాడు దీర్ఘబాహుడు.

ఆ ప్రశ్నకు శంకరశాస్త్రి పెద్దగా నిట్టూర్చి, "నిన్ను శపించిన మునే, నీకు శాప విమోచనం కలిగించాలి. కాని అతడు ఏనాడో, ఈ అడవి ప్రాంతాలు వదిలి హిమాలయాలకేసి వెళ్ళిపోయాడు. అందు

వల్ల, నీకు శాపవిముక్తి లేదు. కాని, ఈ రాక్షసరూపంలోనే కుంతల రాజయ్యే యోగం వున్నది. నువ్వు రాజయ్యాక నీ భోగమేభోగం! ఆహారం కోసం నువ్వు గుహముందు కూర్చుని కునికిపాట్లు పడనవసరం లేదు. రాజయ్యాక ఇష్టమైన ఆహారం భుజిస్తూ, పీపాల కొద్దీ ద్రాక్ష రసాయనం తాగుతూ, పన్నీట స్నానం చేసి, పట్టు వస్త్రాలు ధరించి, పది మణుగుల బంగారం ఆభరణాలు వేసుకుని, వందల కొద్దీ నౌకర్లూ, చాకర్లూ సేవలందిస్తూండగా, రాజ్యాన్ని తిరుగులేని విధంగా పాలించ గలవు," అన్నాడు.

శంకరశాస్త్రి చెప్పింది ఊహించుకుని పొంగిపోయిన దీర్ఘబాహుడు చిన్నగా చప్పట్లుచరిచి, "నువ్వు చెప్పింది చాలా బావున్నది. కాని నాకు ఆకలి మహా ఎక్కువ. రోజుకు ముగ్గుర్ని తినే అలవాటున్నది. ఇది రాజ్య ప్రజలు మెచ్చరు గదా?" అన్నాడు.

"అలాంటి శంకే వలదు. రాక్షసేంద్రా! రాజ్యంలో జనాభా విపరీతంగా పెరిగి పోయి, పండిన పంటలు చాలక, ఎక్కువ మంది ఒంటిపూట పస్తులతో అలమటి స్తున్నారు. ఇలాంటి సమయంలో నువ్వు ముగ్గుర్నికాదు, నలుగుర్ని తిన్నా జనాభా సమస్యను పరిష్కరిస్తున్నందుకు ప్రజలు నిన్ను వేనోళ్ళ కీర్తిస్తారే తప్ప దూషించరు," అన్నాడు శంకరశాస్త్రి.

దీర్ఘబాహుడు కొంచెం సేపు ఆలోచించి, "అంతా బావున్నది కాని, నేను రాజును కావాలంటే ఇప్పుడున్న రాజు మాటేమిటి?" అని ప్రశ్నించాడు.

"నీ తిరుగులేని రాక్షసబలం ముందు, అసమర్థుడైన మా రాజు బలపరాక్రమాలే పాటి? నువ్వు నా వెంట వస్తే, నిన్ను రాజును



చేసే బాధ్యత నాది. సరా!" అన్నాడు శంకరశాస్త్రి.

ఇందుకు తలవూపి దీర్ఘబాహుడు శంకరశాస్త్రితో బయలుదేరాడు. అడవి మార్గం దాటేంతవరకు శాస్త్రి భయంతో దిక్కులు చూస్తూ నడిచినవాడు, అడవి దాటగానే కూనిరాగాలు తీస్తూ చకచకా నడవసాగాడు.

ఇది గమనించిన దీర్ఘబాహుడు, "బ్రాహ్మడా! అడవిలో భయపడుతున్నట్టు కనిపించి, ఇప్పుడేమో అతి ఉత్సాహంగా నడుస్తున్నావేం! కారణమేమిటి?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు శంకరశాస్త్రి పెద్దగా నవ్వి, "అడవి దాటే వరకూ ఏ క్రూరమృగమైనా హఠాత్తుగా వచ్చి మీదపడుతుందేమో అని, భయపడుతూ వచ్చాను, మరి ఇప్పుడు అడవి దాటాక ఆ భయం లేదుకదా!" అన్నాడు.

"అదేమిటి! అడవి బయట క్రూర మృగాలుండవా, ఎందుకని?" అని అడిగాడు ఆశ్చర్యంగా దీర్ఘబాహుడు.

శంకరశాస్త్రి చిరునవ్వు నవ్వి చేతులు ఊపుతూ, "రాక్షసేంద్రా! చేపలు నీటిలోనే వుంటాయి. మనుషులు గ్రామాల్లోనే నివసిస్తారు. అలాగే మృగాలు అడవుల్లోనే వుంటాయి. అలా కాక, మనుషులు అడవుల్లోకి వస్తే మృగాలు పీక్కు తింటాయి. ఒకవేళ మృగాలు గ్రామాల్లోకి వస్తే, మనుషులు వాటిని వేటాడి చంపుతారు. ఈ కారణాల వల్ల, ఏ జీవి ఎక్కడ వుండాలో అక్కడే వుండాలి. అది అనంతమైన ఈ సృష్టిధర్మం!" అన్నాడు.

ఇద్దరూ మౌనంగా కొంత దూరం నడిచాక, ఒక నది ఒడ్డున గురుకులం ఒకటి కనిపించింది. ఆ గురుకులంలో విద్యార్థులు ఒక వైపు సాముగరిడీలు, ఇంకో వైపు విలువిద్య, మరొక వైపు ఖడ్గ






విద్యలూ ప్రదర్శిస్తున్నారు. వాళ్ళకు ఎదురుగా కొంచెం దూరంలో ఒక తాటి ఆకుల పాక ముందు ఎత్తయిన వెదురు పుల్లల ఆసనంలో కూర్చుని, శిష్యుల నైపుణ్యాన్ని నిశితంగా గమనిస్తున్నాడు వారి గురువు, ప్రతిభుడు.

దీర్ఘబాహుడు ఆ దృశ్యాన్ని వింతగా చూస్తూ, "బ్రాహ్మణా! ఇక్కడ జరుగుతున్న గొడవంతా ఏమిటి?" అని అడిగాడు.

శంకరశాస్త్రి దూరంనుంచే చేతులెత్తి ప్రతిభుడికి నమస్కరించి, "ఇదొక గురుకులం. రాకుమారులకూ, ఇతరత్రా రాజ్యంలోని ప్రముఖులైన వారి కుమారులకూ ఆ కూర్చున్న ప్రతిభుడనే గురువు క్షాత్రవిద్యలతోపాటు, ధర్మశాస్త్ర విషయాలు బోధిస్తాడు. మాతృదేవోభవ, పితృదేవోభవ, గురుదేవోభవ అని మేము ఆయనను తల్లిదండ్రుల తర్వాత, అంతటి సముచిత స్థానం ఇచ్చి పూజిస్తాము. అయోధ్య, కోసల, అవంతీపుర రాజులే కాక ఇంకా గొప్ప పరాక్రమవంతులుగా కీర్తింపబడుతున్న రాజులూ, చక్రవర్తులూ, ఈ ప్రతిభుడికి శిష్యులే! ఈయనే గనక తలుచుకుంటే ప్రపంచాన్ని జయించగలడు!" అని చెప్పాడు.

ఆ మాటలు వింటూనే దీర్ఘబాహుడు తడబడుతున్న గొంతుతో, "అలాగా! అయితే ప్రతిభుడు రాజై సర్వ భోగాలనుభవించక, సన్యాసిలా అన్నీ త్యజించి ఇలా ఒంటరిగా ఆ తాటాకుల పాకలో ఎందుకు జీవించడం?" అని ప్రశ్నించాడు.

"ప్రతిభుడు తను రాజు కావాలని ఎన్నడూ కోరడు. ఎందుకంటే ఆయనకు తెలిసిందల్లా తన శిష్యుల్ని ఉత్తమమైన రాజులుగా, ప్రతిభావంతులైన పౌరులుగా తీర్చిదిద్దడమే. అదే తన విద్యుక్త ధర్మంగా భావిస్తాడాయన!" అని చెప్పి శంకరశాస్త్రి నాలుగడుగులు ముందుకు వేసి వెనక్కు తిరిగి చూసే సరికి అప్పటి వరకూ ఏదో ఆలోచిస్తూ నిలబడి వున్న దీర్ఘబాహుడు, అప్పుడే ఏదో స్ఫురించినట్టు గిరుక్కున వెనుదిరిగి పెద్ద పెద్ద అంగలతో అడవికేసి వెలుతూండడం కంటబడింది.

శంకరశాస్త్రి పెద్దగా నవ్వి, గట్టిగా చప్పట్లు కొడుతూ, "ఓయీ రాక్షసా, నీకేమైంది? ఆగు, వెళ్ళకు," అంటూ కేక పెట్టాడు.

అయితే దీర్ఘబాహుడు వెనుతిరిగైనా చూడకుండా, పెద్దపెద్ద అంగలతో మరింత

వేగంగా నడుస్తూ కొద్ది సేపట్లో కనుమరుగై పోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దీర్ఘ బాహుడు రాజై సర్వసుఖాలూ అనుభ వించాలని అడవి వదలి వచ్చి కూడా, ప్రతిభుణ్ణి గురించి విన్నవెంటనే, ఎందుకు తన నిర్ణయం మార్చుకుని వెనుదిరిగి పోయాడు? ఏదో ఒకనాడు క్షాత్ర విద్యల్లో మహాప్రతిభాశాలి అయిన ప్రతిభుడు, తనను వధిస్తాడని భీతిచెందా? లేక శంకరశాస్త్రి తనప్రాణాలు రక్షించు కునేందుకు, తనను నయవంచన పాలు చేశాడని అను మానించా? ఒక వేళ అదే నిజమైతే అతడు శాస్త్రిని అక్కడికక్కడే విరుచుకుతినాలి కదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దీర్ఘబాహుడు తన నిర్ణయం మార్చుకుని తిరిగి వెళ్ళి పోవడానికి కారణం–అతడిలో అంతో యింతో వున్న ఇంగిత జ్ఞానం, తార్కిక బుద్ధీ. దారిలో అతడడిగిన ప్రశ్నలకు, శంకరశాస్త్రి ఇచ్చిన సమాధానాలు, అతడి ఆలోచనల్లో మార్పుకు కారణమైనవి. శంకరశాస్త్రి పండితుల ద్వారా, శాస్త్రజ్ఞుల ద్వారా విన్న విషయాలను జోడించి, ఎంతో సమయస్ఫూర్తితో దీర్ఘబాహుడికి సృష్టిలో మృగధర్మం గురించీ, గురుధర్మం గురించీ వివరించాడు. ఆ వెంటనే దీర్ఘబాహుడికి తన రాక్షసధర్మం కూడా బోధపడింది. మృగాలు అరణ్యాలలో వుండడమే ధర్మమైనప్పుడు; గొప్ప క్షాత్ర విద్యాపారంగతుడైన గురువు, తాను యోగిలా జీవిస్తూ, విద్యను శిష్యులకు నేర్పడమే తన ధర్మంగా భావించినప్పుడు–తాను మాత్రం తన రాక్షసధర్మాన్ని విడిచి రాజు కావడం సృష్టి ధర్మానికి వ్యతిరేకమని అతడు భావించాడు. అందువల్లనే, రాక్షసధర్మానికి కట్టుబడి, అతడు తన స్థావరానికి తిరిగి వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (–కల్పితం)

[ఆధారం: మల్లవరపు మనోహరరెడ్డి రచన]



# తెలివిగలవాడు



హేలాపురనివాసి వరహాలయ్య కుమారుడు మాధవుడు, ఎనిమిదేళ్ళవాడు. తల్లిదండ్రులకు కడగొట్టువాడుకావడంతో, ఎంతో అల్లారుముద్దుగా పెరిగాడు. వాణ్ణి బంధువులందరూ మంచిచురుకైనవాడనీ, చాలాతెలివైనవాడనీ మెచ్చుకునేవారు.

అయితే, ఇంత తెలివిగలవాడని పేరు తెచ్చుకున్న మాధవుడు, ఒక్కవిషయంలో మాత్రం అతి తెలివితక్కువగా ప్రవర్తించే వాడు.

అదేమంటే–ఒకసారి వరహాలయ్య దూరపు బంధువు, పొరుగూరునుంచి ఏదో పనిమీద ఆయన ఇంటికి వచ్చాడు. ఆ బంధువు ఒకవారం రోజులుండి, తిరిగి వెళ్ళిపోయేముందు, జేబులోంచి ఒక వెండి నాణెం, ఒక రాగినాణెం తీసి, మాధవుడికి చూపించి, "ఒరే, మాధవా! ఎందుకో నీ తెలివితేటల్ని పరీక్షించాలనిపిస్తున్నది!" అంటూ నవ్వి, మాధవుడి ముందు ఆ రెండు నాణేలను వుంచి, "ఈ రెంటినీ నీకిస్తాననుకోకు. నువ్వు వీటిలో ఏదో ఒక్కదాన్ని మాత్రమే తీసుకోవాలి, తెలిసిందా!" అన్నాడు.

మాధవుడు ఒక్కక్షణంకూడా ఆలస్యం చేయకుండా, రాగినాణెం తీసుకున్నాడు. ఇది చూసి వరహాలయ్య బంధువు తెల్లబోయాడు. ఎంతో తెలివిగలవాడని అందరూ అనుకునే మాధవుడు వెండి నాణెం కాక రాగినాణెం ఎందుకు తీసుకున్నాడో, ఆయనకు అర్థంకాలేదు. ఆయన లోలోపల వాడి తెలివితక్కువతనానికి నవ్వుకుని, వెండినాణెం జేబులో వేసుకుని వెళ్ళిపోయాడు.

ఈ విషయం మర్నాటికల్లా, ఊళ్ళో అందరికీ తెలిసిపోయింది. అంతా తెలివిగలవాడని చెప్పుకునే మాధవుడు, ఏమంత తెలివిగలవాడు కాకపోగా, చాలాతెలివితక్కువవాడని వాళ్ళు నవ్వుకున్నారు. ఊళ్ళో వాణ్ణి పరీక్షించేందుకు ఎవరు వెండీ,రాగి నాణేలు యివ్వజూపినా వాడు రాగినాణెమే తీసుకునేవాడు. ఇలా కొంత కాలం జరిగింది. ఒక రోజున వరహాలయ్య

కోనే నాగవెంకట ఆంజనేయులు

ఇంటికి సోమయ్య అనే బంధువు వచ్చాడు. సోమయ్య, వరహాలయ్య భార్యకు వేలువిడిచిన పినతండ్రిగారి కుమారుడు. మాధవుడి సంగతి ఊరివాళ్ళద్వారా తెలుసుకున్న సోమయ్య, నాలుగురోజుల తర్వాత తన ఊరికి తిరిగి ప్రయాణమై వెళ్ళిపోతూ, జేబులోంచి ఒక వెండి నాణెం, ఒక రాగి నాణెం తీసి మాధవుడిముందుంచి, "ఒరే, మాధవా! వీటిలో నీకు నచ్చిన నాణెం ఒకటి తీసుకోరా అబ్బాయ్," అన్నాడు.

మాధవుడు ఎప్పటిలాగే రాగినాణెం తీసుకున్నాడు. వాడి తెలివితక్కువతనానికి సోమయ్య అందరిలా నవ్వుకోలేదు, చాలా విచారించాడు.

ఆయన, మాధవుడి భుజంతడుతూ, "ఒరే, బాబూ! విలువైన వెండి నాణెం తీసుకోకుండా, ఎప్పుడూ రాగినాణెమే ఎందుకు తీసుకుంటున్నావురా? వెండి నాణెం విలువ తెలియనంతటి మూర్ఖుడివానువ్వు. ఒకప్పుడు నీ తెలివితేటలను గురించి చాలా విన్నాను. ఆ తెలివంతా ఏమైపోయింది?" అన్నాడు బాధగా.

మాధవుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా ముసిముసిగా నవ్వుతూ వూరుకున్నాడు. కాని సోమయ్య మరొకసారి రెట్టించి అడిగేసరికి, "మామయ్యా! నేను వెండి నాణెంతీసుకోవడం మొదలెడితే, ఇంకెవ్వరూ నా తెలివితేటల్ని పరీక్షించేందుకు, ఈ ఆట ఆడరు కదా! అప్పుడు, నాకు కనీసం రాగి నాణెంకూడా దక్కదు. ఈ విధంగా ఎప్పుడూ రాగినాణేలే తీసుకోవడంవల్ల నేను వాటిని దాచే పెద్ద డబ్బా దాదాపు నిండిపోయింది, చూడు!" అంటూ, మామకు డబ్బా తెచ్చి చూపించాడు.

సోమయ్యకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతాకాదు. ఆయన, మాధవుణ్ణి గొప్పగా మెచ్చుకున్నాడు. వాడు పెద్దగా నవ్వి, "అందరూ నన్ను తెలివితక్కువ వాడనుకుంటున్నంత మాత్రాన, నా తెలివితేటలకు కలిగే నష్టం ఏమీ లేదుకదా! ఇప్పుడు తెలిసిందా మామయ్యా, తెలివితక్కువతనం ఎవరిదో? అయినా, మామయ్యా, ఈ జరిగింది ఎవరికీ చెప్పకు, నీ పుణ్యముంటుంది," అన్నాడు.



# దొంగనవ్వు

ఎలాంటి శరీరశ్రమాచేయలేని, మరుగుజ్జు ఒకడుండేవాడు. అయితే అతడిలో మంచి వాక్చాతుర్యం వుండేది. వాడు గ్రామాల వెంట తిరుగుతూ, పదిమందినీ తన హాస్యోక్తులతో నవ్విస్తూ, వాళ్ళిచ్చే కొద్దిపాటి డబ్బుతో కాలంగడుపుతూండేవాడు. అందరూ వాణ్ణి వామనభట్టు అనేవాళ్ళు.

ఒకనాడు వాడు, ఒక గ్రామంనుంచి మరొక గ్రామానికి పోతూ, ఎండతీవ్రంగా వుండడంతో, దారి పక్కనవున్న ఒక చెట్లగుంపు చేరి, వాటి నీడన కూర్చున్నాడు.

కొద్దికాలం గడచేసరికి వామనభట్టుకు, చెట్లకిందవున్న ఎండుటాకుల మీదుగా ఎవరో నడిచి వస్తున్న శబ్దం వినిపించింది. వాడు తలతిప్పి చూసేసరికి,పుష్టి మీసాలతో, గొడ్డలి భుజాన పెట్టుకుని తనకేసి వస్తున్న ఒక ఆజానుబాహుడు కనిపించాడు. వాణ్ణి చూస్తూనే దొంగ అని గ్రహించిన భట్టు, తన భయాన్ని బయటపడనీకుండా, "దేవుడెంతటి పుణ్యాత్ముడు! సూర్యతాపంతోపాటు, దాన్నుంచి రక్షణగా చెట్లనీడకూడా యిచ్చాడు," అన్నాడు.

దొంగ వాణ్ణి సమీపించి, "నువ్వు నలుగుర్నీ నవ్వించి నాలుగు రాళ్ళు మూటగట్టుకునే వామనభట్టువని నేనెరుగుదును. నీ మాటలతో నన్ను నవ్వించి పారిపోవాలని చూస్తున్నావు. అది నీవల్ల కాదు. పుట్టి బుద్ధెరిగాక, ఈనాటి వరకూ నేను నవ్వలేదు. నవ్వు నాలుగువిధాల చేటని, మా తాత చెబుతుండేవాడు. సరే, ఈ సంచీలో వున్న డబ్బులు మర్యాదగా యిచ్చెయ్యి," అన్నాడు.

"ఆహాఁ, మీ తాత శాస్త్రాలన్నీ తలకిందులుగా చదివిన వాడైవుండాలి. నవ్వు నాలుగందాలచేటంటే-అది మనక్కాదు, శత్రువులకు," అంటూ వామనభట్టు పెద్దగా నవ్వాడు.

"నీ చమత్కారపుమాటలతో నన్ను నవ్వించాలని చూస్తున్నావేమో! అది నిన్ను పుట్టించిన వాడివల్లకూడా కాదు," అంటూ దొంగ, భట్టు దగ్గరున్న డబ్బుసంచీ తీసుకుని, వెనుదిరగబోతూ ఆగి, "నీ బోటివాణ్ణి ప్రాణాలతో వదిలితే, నా ప్రాణానికే ముప్పు తేగలవు. నీ తల నరుకుతాను," అంటూ గొడ్డలి పైకెత్తాడు.

అది చూస్తూనే వామనభట్టు ఏమీతొణక్కుండా, "అయ్యా, అసలే నేను పొట్టివాణ్ణి. తలమాత్రం నరక్కండి. మరీ పొట్టివాణ్ణయిపోతాను. అందరూ నన్ను అవహేళన చేస్తారు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే దొంగ పొట్టచెక్కలయ్యేలా నవ్వుతూ, "ఊహ తెలిశాక ఒక్కగానొక్కసారైనా నవ్వని నన్ను నవ్వించావు, భళా భళీ!" అంటూ డబ్బు సంచీ భట్టుకు యిచ్చి గుబురుచెట్ల చాటుకు వెళ్ళిపోయాడు.





# స్వర్ణసింహాసనం

②

[హైహయ వంశస్థుడైన కౌండిన్య దేశాధిపతి పౌరస్వతుడు మిగిలిన రాజ్యాలను జయించి, దక్షిణాపథానికి సార్వభౌముడయ్యాడు. పౌరస్వతుడికి పదవ తరం వాడైన శ్రీదత్తుడి కాలానికి సామంత రాజ్యాలన్నీ విడిపోయాయి. శ్రీదత్తుడి ఏకైక కుమారుడు విజయదత్తుడు గురుకులంలో విద్యాభ్యాసం పూర్తి చేయనున్న తరుణంలో, వెంటనే రాజధానికి తిరిగి రావలసిందిగా కబురు వచ్చింది. రాజధానికి చేరిన యువరాజు విజయదత్తుడికి–తమ రాజ్యంలోని నిధి నిక్షేపాలను కొల్లకొట్టడానికి పొరుగురాజులు కూడబలుక్కుని రహస్యంగా కుట్ర పన్నుతున్నారని మహారాజు శ్రీదత్తుడు చెప్పనారంభించాడు. -తరవాత]

మహారాజు తన మాటలను తిరిగి కొనసాగిస్తూ, "కొడుకు కోరికతో మరాళుడు సమస్య మరింత జటిలమైనట్టు భావించాడు. కొడుకుకు వెంటనే అవునని గాని, కాదని గాని సమాధానం చెప్పక, మరొక కోణం నుంచిసమస్యకు పరిష్కారం ఆలోచించటం ప్రారంభించిన కాళింది ప్రభువు, మాధవసేనుడి పుట్టు పూర్వోత్తరాలన్నీ ఆరాతియ్యడం సాగించాడు.

ఆ పరిశోధనలో, మాధవసేనుడు మనకు బంధువైన కారణంగా, మనం తెలుసుకోవాలన్న ఆసక్తి చూపనివీ, మరాళుడికి ఉపకరించేవీ అయిన కొన్ని అంశాలు వెలుగులోకి వచ్చాయి. అవేమిటంటే—కేవలం స్వయంవర ఆహ్వానం అందిన కారణంగా వచ్చి, వసుమతి తన మెడలో వరమాల వేసినందువల్ల, ఆమెను పెళ్ళాడాడు తప్పితే, వసుమతి పట్లగాని, హైహయ వంశీకులమైన మనపట్ల గాని అతడికి, ప్రత్యేకమైన ఆదరభావం ఏమీ లేదు. అంతేగాక, అంతర్గతంగా అతడిలో తీవ్రమైన ఐశ్వర్య వాంఛవున్నట్టు, మరాళుడు పంపిన నేర్పరులైన గూఢ చారులు గ్రహించి, తమ రాజుకు నివేదించారు.

లక్ష్మీగాయత్రి

మాధవ సేనుడిలోవున్న ఆ ఒకేఒక్క బల హీనతను పునాదిగా చేసుకుని, తనకోటను నిర్మించుకోవడానికి నిశ్చయించుకున్న మరాళుడు, మాఘశుద్ధ సప్తమినాడు, తమ కులదైవమైన సూర్యభగవానుడికి జరిగే రథోత్సవానికి రావలసిందిగా, మాధవ సేనుడికి ప్రత్యేక ఆహ్వానం పంపాడు.

అంతకు ముందు ఎన్నడూ రాని, ఆ ఆహ్వానానికి కాస్త ఆశ్చర్యపడినా, భగవత్కార్యం కనక, సకుటుంబంగా చంపక దేశానికి బైలుదేరాడు, మాధవ సేనుడు.

చంపక రాజులు ప్రతి ఏటా, ఆ రథోత్సవాన్ని అత్యంత వైభవంగా జరుపుతారు. రథసప్తమినాటి ప్రాతఃకాలానే సూర్యదేవుడి బంగారు విగ్రహాన్ని రథంలో వుంచి, ముఖ్య వీథులన్నిటా ఊరేగిస్తారు. ఆ ఊరేగింపులో ప్రత్యేకత ఏమిటంటే, సూర్యభగవానుడు ఊరేగే ఆ రథానికి గుర్రాలు వుండవు! రథానికి పూన్చవలసిన ఏడు గుర్రాలకు బదులుగా, రాజ కుటుంబంలో ముఖ్యులైన ఏడుగురు పురుషులు, రథానికి కట్టిన ఏడు తాళ్ళను లాగుతారు. ఆ ఏడుగురిలో చంపక దేశపు మహారాజూ, యువరాజూ తప్పనిసరిగా వుంటారు. మిగిలిన ఐదుగురినీ మహారాజు నిర్ణయిస్తారు.

ఆనవాయితీగా ప్రతి ఏటా జరిగే, ఈ ఉత్సవాలలో, ఈసారి మరాళుడు, మాధవ సేనుణ్ణి ఏడుగురిలో ఒకడుగా ప్రకటించి, ఒక తాడును తనే స్వయంగా మాధవ సేనుడి నడుముకు అమిత గౌరవంతో కట్టి అతడి పక్కల ఇరువైపులా వున్న రెండు స్థానాలనూ తనకూ, కొడుకు చక్రభూపతికీ కేటాయించాడు.

తొలిసారిగా రాజకుటుంబానికి చెందని వ్యక్తి, సూర్యుడి రథాన్ని లాగబోవటం, స్వయంగా మహారాజే ఆనవాయితీని భంగపరచటం చూసిన ప్రజల్లో గుసగుసలు చెలరేగాయి.

అది గమనించిన మరాళభూపతి, ప్రజలనుద్దేశించి సమ్మోహనంగా ప్రసంగిస్తూ, "అత్యంత గౌరవనీయుడైన ఈ కాళింది ప్రభువు, ప్రత్యేకంగా రథోత్సవం కోసమే, మనదేశానికి వచ్చిన మన అతిథి! పిలువగా వచ్చిన అతిథి, కుటుంబ సభ్యులకంటే గౌరవనీయుడనీ, ఆయనకు జరగవలసిన మర్యాదలన్నీ, ఆ స్థాయిలోనే జరపాలనీ



ధర్మశాస్త్రాలు చెబుతున్నవి. ఆ ధర్మాన్ని అనుసరించే నేను ఒక తాడును ఆయనకు ఇచ్చి గౌరవించి, మనదేశపు మర్యాదనూ, ఔన్నత్యాన్నీ నిలబెట్టాను!" అన్నాడు.

ఇది విని, మాధవసేనుడు అమితానందంతో పొంగిపోయి, ఆనాటి మధ్యాహ్నం జరిగిన బ్రహ్మాండమైన విందు భోజనానంతరం, తన ఆనందాన్నీ, చంపక ప్రభువు తనకిస్తున్న ఆత్మసమాన గౌరవ మర్యాదల పట్ల, తన కృతజ్ఞతనూ బాహాటంగా వెల్లడించాడు.

మాధవసేనుడి కృతజ్ఞతా పూర్వక వచనాలకు, మరాళభూపతి, గంభీరంగా తలపంకించి వూరుకున్నాడు. దాంతో కాస్త చివుక్కుమన్న మాధవసేనుడు, ఆ తర్వాత ఏకాంతంలో, మరాళుడితో, "రాజా, మీరు నా పట్ల చూపుతున్న గౌరవానికి నేనెంతో ఆనందిస్తూ ఇందాక మాట్లాడిన మాటలు, మీకు అంతగా రుచించినట్టు లేవు. నామాటలు మిమ్మల్నేమీ నొప్పించలేదు కదా?" అన్నాడు ఎంతో స్నేహపూర్వకంగా.

దీనికి మరాళభూపతి, ఎంతో చలించిపోయినట్టుగా చప్పున ముందుకు వంగి, మాధవసేనుడి చేతులు పట్టుకుంటూ, "మీరు మమ్మల్ని నొప్పించటమా! ఎంత మాట! నామనసులో వేరే ఆలోచనవున్నది. దాన్ని గురించి మీకు ఇప్పుడు చెప్పటమా, మానటమా అన్న సందేహంలో వున్నాను," అన్నాడు.

ఆ మాటలకు మాధవసేనుడు కాస్త ఆశ్చర్యంగా, "మీరు సందేహించక అదేమిటో చెప్పండి," అన్నాడు.



మరాళుడు సంకోచిస్తూనే, "నేను చెప్పబోయేది ఒక కోరిక, మిత్రమా! అయితే అయ్యో, ఆహ్వానించి గౌరవించిన వ్యక్తి అడిగిన కోర్కెను తీర్చలేకపోయానే అని, మీరు బాధపడకూడదు. ఆ షరతు మీద అయితేనే చెబుతాను," అంటూ నేర్పుగా ముందరి కాళ్ళకు బంధం వేశాడు.

మాధవసేనుడు చిరునవ్వుతో, "చెప్పండి!" అన్నాడు.

అప్పుడు మరాళుడు, "సరే చెబుతున్నాను! మీరు ఇక్కడికి మా అతిథులుగా రాకముందే మీ అమ్మాయి శ్రీలేఖ రూపగుణశీలాదుల గురించిన ప్రశంస, మా దేశాన్ని చేరింది, అవన్నీ విన్న మా యువరాజు, ఆమెనే వివాహమాడాలన్న కోర్కెను, నా దగ్గర వెల్లడించాడు. అయితే నేను, 'నాయనా, కౌండిన్య యువరాజు

ఆమెకు బంధువూ, ఈడైనవాడూ—ఆమెను అతడికివ్వాలన్న సంకల్పం వారికిగాని వున్నదేమో!' అన్నాను.

"అయితే మా యువరాజు, 'నాన్నా, కౌండిన్య ప్రభువులు ఒకప్పటి సార్వభౌములు కావచ్చు. ఎన్నో నిధినిక్షేపాలు వారి దగ్గర నేటికీ మూలుగుతుండవచ్చు. కానీ, రాజ్యం వీరభోజ్యం! వీరుడైన వాణ్ణే ఉత్తమ క్షత్రియ కన్య వరిస్తుంది. నా శౌర్య ధైర్యాలతో, నేను శ్రీలేఖ మనసును ఆకట్టుకోగలనన్న నమ్మకం, నాకున్నది. ఆమే గనుక నన్ను వరించిననాడు, మిగిలిన దక్షిణాపథాన్నంతటినీ జయించి, ఆమెను దక్షిణ భారతదేశానికంతటికీ మహారాణిని చేస్తాను. అంతేకాదు, పుత్రసంతానం లేని ఆమె తండ్రిని నా తండ్రితో సమానంగా గౌరవించి, అర్ధ భాగానికీ, కౌండిన్య దేశంనుంచి లభింప జేసుకున్న ఐశ్వర్యంలో సగభాగానికీ అధిపతిని చేస్తాను' అన్నాడు.

"రాజా, ఈ మాటలు విని నేను వెంటనే ఏమీ మాట్లాడలేకపోయాను. కొంతసేపాగి, 'నాయనా, బంధుత్వం కోరినవారు ఎంతో స్నేహంగా ప్రవర్తించాలి. ముందుగా నేను కాళింది ప్రభువుతో స్వయంగా ఈ విషయం మాట్లాడతాను. ఆయన అభిప్రాయాన్ని బట్టి మనం నడుచుకుందాం. నువ్వు మాత్రం తొందరపడకు,' అన్నాను. ఇదీకథ!" అని ఆగాడు మరాళుడు.

ఊహించని విధంగా, మరాళుడి నోటి వెంట వచ్చిన మాటలకు, మాధవసేనుడు మొదట స్తంభించిపోయాడు. క్రమంగా తేరుకున్న అతడి మనసు, నెమ్మది నెమ్మదిగా మరాళుడి మాటలకు ఆకర్షింపబడుతూ, అనంతైశ్వర్యంగురించీ, దక్షిణాపథ సార్వభౌమత్వం గురించీ కలలు కనటం ప్రారంభించింది. ఆ కలల మత్తులో అతడు, తాత్కాలికంగా భార్యాబిడ్డల ఇష్టాయిష్టాల గురించి మరిచి పోయాడు.



ఆ తర్వాత దాదాపు మూడు గంటల పాటు, మరాళభూపతి, మాధవసేనుల మధ్య ఏకాంత సంభాషణ నడిచింది. ఆ మూడు గంటల సమయంలో మరాళుడు, మాధవసేనుణ్ణి దాదాపు పూర్తిగా లొంగదీసుకున్నాడు.

మాఘమాసంలో, వారిద్దరి మధ్య ఆ రకమైన ఒప్పందాలు జరిగే నాటికి, నీ గురుకులవాసం ఇంకా ఆరునెలలున్నది. నీ శిక్షణ మాసంలో ముగిసినా, ఆశ్వయుజ మాసంలో గురుకులంలో వైభవంగా జరిగే దేవీనవరాత్రులు పూర్తి అయిన తర్వాతే నిన్ను స్వదేశానికి పంపటానికి కృష్ణ చంద్రులవారు నిర్ణయించిన విషయం కూడా మరాళుడికి తెలిసింది.

ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకుని, నువ్వు గురుకులం నుంచి తిరిగిరాక ముందే మనదేశాన్ని ముట్టడించాలని వారు నిర్ణయించుకున్నారు. ప్రతి ఏటా చైత్రమాసంలో వసంతోత్సవాలకు మన దేశం వస్తున్నట్టే, ఈ సంవత్సరం కూడా మాధవ సేనుడు మనదేశానికి వచ్చి, మన సైనిక వివరాలు సాధ్యమైనంతగా గ్రహించే టట్టు నిర్ణయం జరిగింది. వైశాఖ, జ్యేష్ఠ మాసాల్లో కాళింది, చంపక, కుంద సేన లన్నిటినీ ఒకచోట చేర్చి, ప్రత్యేకమైన తర్ఫీదు ఇస్తారు. రానున్న మాసం ఆషాఢం. దట్టమైన మబ్బులతో, సూర్యకాంతి తక్కువగా వుండే వర్షఋతు ప్రారంభ మాసమైన ఆషాఢం, సేనల రహస్య కదలికలకు చాలా అనువైనదన్న విషయం నీకుతెలిసిందే కదా! ఆ ఆషాఢ మాసంలో మూడు దేశాల సేనలూ మన దేశాన్ని ముట్టడిస్తాయి.

"నాయనా, విజయా! ఈ రోజు జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి. ఈనాటికి ఆ త్రిసైన్య కూటమి తీవ్రమైన సమర సన్నాహంలో వుండి వుంటుంది. మరికొద్ది రోజుల్లోనే



మనదేశం రణభూమి కాబోతున్నది. ఆకస్మికంగా ఏర్పడిన ఇటువంటి తీవ్ర పరిస్థితుల వల్ల, నిన్ను అర్ధాంతరంగా పిలిపించక తప్పలేదు. ఊహించని విధంగా వచ్చిపడిన, ఈ విపత్కర పరిస్థితి, మొదట్లో నన్ను బాగా కృంగతీసింది. అయితే మన రాజగురువులు శివానందుల వారు చెప్పిన మాటలు, నాలో కొత్త ఆశల్ని చిగురింపజేశాయి.

వేగులద్వారా నాకు విషయాలన్నీ సమగ్రంగా తెలియగానే, నీ భవిష్యత్తు ఏమవుతుందో అన్న ఆందోళనలతో, శివానందులను నీ జాతకం చూసి భవిష్యత్తు చెప్పవలసిందిగా కోరాను. నీ జాతకాన్ని బాగా సూక్ష్మంగా పరిశీలించిన ఆయన, మొదట్లో నాకు ఏమీ చెప్పక, అఖండ పూజలో కూర్చున్నారు. ధ్యాన



మగ్నులైన ఆయన కళ్ళముందు, ఉదయ సూర్య బింబమూ, పడగెత్తిన ఒక మహా సర్పమూ, ధగద్ధగాయమానంగా మెరుస్తున్న సువర్ణమూ, ఆరుగురు అందమైన కన్యలూ కనిపించారట! ఆ విషయం నాకు చెబుతూ ఆయన, 'మహారాజా! యువ రాజు అఖండ జాతకుడు. అతడి ప్రస్తుత దశ కొన్ని గట్టిచిక్కులనూ, ప్రాణగండాన్నీ కూడా సూచిస్తున్నా, గ్రహబలం వల్ల అతడు సర్వత్రా విజయుడే అవుతాడు. పౌర్ణమిలోగా అతడు ఇక్కడ వుండటం ఎంతయినా అవసరం. నా అంచనా ప్రకారం, అతడికి త్వరలోనే ఒక కొత్త నిధి లభిస్తుంది. పౌర్ణమిలోగా అతడిని రప్పించి, అతడి సమక్షంలో మన మైదానంలో, నేను మంత్రజలం చల్లి సూచించినంత మేరా తవ్వించండి,' అన్నాడు. అప్పటికే నిన్ను పిలిపించాలని అనుకుంటున్న నేను, ఆయన మాటలతో, నీకు వెంటనే వార్త పంపించాను. ఎల్లుండి త్రయోదశి శుక్ర వారం! బహుశా రాజగురువులు, ఆనాడే తవ్వకాలు ప్రారంభించేస్తారేమో!" అని శ్రీదత్తుడు చెప్పడం పూర్తిచేసి గాఢంగా ఊపిరి తీసుకున్నాడు.

విజయదత్తుడు సందేహంగా, "కానీ, ఒక వైపు యుద్ధ ప్రమాదం ముంచు కొస్తుండగా మనం యుద్ధసన్నాహాలకు బదులు, తవ్వకాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వటం అంత మంచిది కాదేమో!" అన్నాడు.

ఆ మాటలకు మహారాజు, "శివానందులు చెప్పగానే, నేను ఆ సందేహమే వ్యక్తం చేశాను. కానీ, ఆయన ఎట్టి పరిస్థితుల్లోనూ తవ్వకాలు ఆపవద్దనీ, వాటివల్ల నీకు

ఇంతింతనరాని మేలు చేకూరుతుందనీ గట్టిగా చెబుతున్నారు. తవ్వకాలు మహా అయితే మూడురోజులకంటే ఎక్కువ పట్టదు. అందుకే నేను శివానందులు చెప్పిన ప్రకారమే చెయ్యటానికి నిశ్చయించాను," అన్నాడు.

ఆ జవాబుతో సంతృప్తి చెందిన విజయదత్తుడు, "నాన్నా, ధర్మమూ, న్యాయమూ మనపక్షాన వున్నవి. మనం ప్రయత్నలోపం కూడా చెయ్యటంలేదు. కనుక, విజయం మననే వరిస్తుందన్న ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగుదాం!" అన్నాడు.

కొడుకు మాటలకు మహారాజు తల పంకిస్తూ, ఏదో అనబోయేంతలో, ద్వారం దగ్గర చిన్న అలికిడి అయిన శబ్దం వినిపించింది. ఇద్దరూ అటుకేసి తలలు తిప్పిచూశారు.

ద్వారం దగ్గర నిలబడివున్న భటుడు, మహారాజు తన వైపు చూడగానే నమస్కరించి, "ఎవరో ఒక వ్యక్తి ప్రభువులను అత్యవసరంగా చూడాలని పట్టుబడుతున్నాడు. లక్ష్మీదేవి చేతి ఉత్తరం వచ్చిందని, మీకు చెప్పమన్నాడు," అని విన్నవించాడు.

"సరే, లోపలికి పంపు," అన్నాడు మహారాజు.

భటుడి వెంటవచ్చిన యువకుడు, మహారాజు పక్కన వున్న విజయదత్తుణ్ణి చూసి చప్పున ఆగిపోయాడు. విజయదత్తుడు ఆ యువకుడి ముఖంకేసి కాస్త పరీక్షగా చూసి చిరునవ్వుతో, "నాన్నగారూ, లక్ష్మీదేవి చేతి ఉత్తరంగా వచ్చిన ఈ నవ యువకుడు, మీ మేనకోడలు శ్రీలేఖ!" అన్నాడు.



మహారాజు ఒక్క ఉదుటన లేచి, ఆప్యాయంగా మేనకోడలి రెండు చేతులూ పట్టుకున్నాడు.

శ్రీలేఖ బొటబొటా కన్నీళ్ళు కారుస్తూ, "మామయ్యా, విధిలేని పరిస్థితిలో, నన్ను మీ ఆశ్రయానికి పంపిస్తున్నాననీ, ఇక నాభారం మీదేననీ, మా అమ్మ మీతో చెప్పమన్నది," అన్నది.

ఆ మాటలకు చలించిపోయిన మహారాజు సానునయంగా మేనకోడలితలను నిమురుతూ, "తల్లీ! మీ అమ్మ నిన్ను హక్కుగల చోటుకే పంపింది!" అంటూ కొడుకు వైపు తిరిగి, "విజయా, శ్రీలేఖ ఇక్కడికి రావటమనేది, నీకు జరిగిన మొదటి శుభం. మన క్షత్రియులకు గాంధర్వ వివాహం ధర్మసమ్మతమే! కనుక, నువ్వూ శ్రీలేఖా గాంధర్వ వివాహరీత్యా దంపతులైతే బావుంటుందని, నా ఆలోచన. ఏమంటావు?" అని ప్రశ్నిస్తూనే శ్రీలేఖవైపు చూశాడు.

మేనమామ మాటలతో, గతించిన ఆశలు క్షణంలో పునరుజ్జీవించినట్టు వికసించిన ముఖంతో, చప్పున విజయ దత్తుడి వైపు చూసిన శ్రీలేఖ, అంతలోనే తడబాటు పడి, చప్పున సిగ్గుతో తల వంచుకున్నది.

తండ్రి, శ్రీలేఖల ఆతృత గమనించిన విజయదత్తుడు, చిరునవ్వుతో తల పంకిస్తూ, "మీ ఇష్టం నాన్నా!" అన్నాడు నెమ్మదిగా.

విజయదత్తుడి అంగీకారం విని, మహారాజు ఆనందంతో పొంగిపోతూ, "శుభస్య శీఘ్రం! గాంధర్వ వివాహానికి సంకల్పబలమే ముహూర్తబలం!" అంటూ శ్రీలేఖ కుడిచేతిని తనే స్వయంగా అందుకుని, విజయదత్తుడి దక్షిణ హస్తంలో వుంచాడు. పాణిగ్రహణం అయినవెంటనే, ఆ దంపతులిద్దరూ సంతోషంగా వంగి మహారాజు పాదాలుతాకి భక్తితో నమస్కరించారు. —(ఇంకావుంది)



# పండితుడికి మాతృభాష మరవలేదు!



కమలాపురం అనేది అతి చిన్న కుగ్రామం. ఆ గ్రామంలో వీధిబడి కూడా లేదు. అటువంటి గ్రామానికి ఎక్కడో వున్న కాశీకి వెళ్ళి, శాస్త్రపురాణాలు చదివినవాడు వస్తున్నాడంటే ప్రతి ఒక్కడికీ అతడెలా వుంటాడో చూడాలన్న కుతూహలం కలిగింది.

సంజీవయ్య అనే యువకుడు పక్క గ్రామంవాడు. అతడు ఐదేళ్ళ క్రితం కాశీ వెళ్ళి, అక్కడ గురుకులాల్లో చదివి పండితుడై, తన మేనమామను చూసేందుకు కమలాపురానికి బయలు దేరాడు. ఆ రోజు గ్రామంలో సంత జరుగుతూండడంతో, గ్రామస్థుల్లో చాలామంది తమకు కావలసిన కూర గాయలూ, పండ్లూ, ఇతర వస్తువులూ కొనుక్కుంటున్నారు. కొందరు సంజీవయ్య వచ్చే కాలిబాటకేసి ఆత్రంగా చూస్తున్నారు.

సూర్యాస్తమయానికి, మరికొన్ని ఘడియలుందనగా, సంజీవయ్య గ్రామంకేసి వస్తూ వాళ్ళకు కనిపించాడు. అతడు మెరిసిపోతున్న పట్టుధోవతితో, పొడవాటి ఎరుపురంగు లాల్చీతో, కుదురుగా కత్తిరించిన చిన్నగడ్డంతో—వీటన్నిటికీ వన్నె తెచ్చేలా గుండ్రటి తలపాగాతో, పండితుడిలా కాక, ఏ సంపన్నకుటుంబపు పెళ్ళికొడుకోలా వున్నాడు.

అతడు గ్రామంలో ప్రవేశిస్తూనే, తనకు నమస్కరించినవాళ్ళను దీవిస్తూ, చిరునవ్వుతో వాళ్ళతలల మీద కుడిచేయి పెట్టి ఏవో సంస్కృత శ్లోకాలతో ఆశీర్వదించసాగాడు. ఇది అక్కడ చేరిన వాళ్ళందరికీ చాలా ఆనందం కలిగించడంతోపాటు, ఒక పండితుడితో పరిచయం ఎంతో గర్వకారణం కూడా అయింది.

అయితే, సంజీవయ్య గట్టిగా గొంతు సవరించుకుని, వాళ్ళతో మాట్లాడడం ప్రారంభించేసరికి, అదేమిటో ఏ ఒక్కరికీ అర్థంకాక ఆశ్చర్యపోయారు. దీనిక్కారణం, సంజీవయ్య సంస్కృతంలో మాట్లాడడం ప్రారంభించడం.

చివరకు, ఒకడు ధైర్యం తెచ్చుకుని సంజీవయ్యతో, "బాబూ, నువ్వేం మాట్లాడుతున్నావో మాకు తెలియడం లేదు. మేమంతా అక్షరంముక్కరాని పామరులం! కనక, మాకు అర్థమయ్యే భాషలో కాస్తమాట్లాడు!" అన్నాడు.

సంజీవయ్య సరే అన్నట్టు తలాడించి మాట్లాడడం మొదలుపెట్టాడు. ఐతే, ఇప్పుడు మాట్లాడేది, ఆ ప్రాంతంవాళ్ళు మాట్లాడేభాషే అయినా, అతడి పైస్థాయి పదజాలం ఎవరికీ అంతుబట్టలేదు. ఐదేళ్ళపాటు మహాపండితుల మధ్యమెలగడంతో, అతడికి సామాన్యులు మాట్లాడే వాడుకభాష మరుగునపడిపోయింది!

ఐతే, అక్కడ చేరినవాళ్ళలో కొందరికి అతడివాలకం ఏమాత్రం నచ్చలేదు.





ఐదేళ్ళ పాటు కాశీలో పండితులమధ్య తిరిగినంత మాత్రాన, ఎవరైనా మాతృ భాషను అంత తికమకగా మాట్లాడుతారా?

ఆ సమయంలో సంజీవయ్య నిలబడి వున్నచోటుకు దాపులనే కొందరు యువకులు పొట్టేళ్ళ పందెంచూస్తూ ఆనందిస్తున్నారు. హఠాత్తుగా వాటిల్లో ఒకదానికి, ఈయువపండితుడిమీద కన్ను పడింది. బహుశా, అది తానానాటివరకూ చూడని సంజీవయ్య వస్త్రధారణ ఆకర్షించి రెచ్చిపోయేలా చేసివుంటుంది.

ఆ పొట్టేలు తానంతవరకూ ఢీకొడుతున్న పొట్టేలును వదిలి, సంజీవయ్యకేసి వచ్చి, తలవంచి అతణ్ణి ఢీకొట్టేందుకు వెనకకాళ్ళమీద లేవసాగింది. ఐతే, సంజీవయ్య తనముందు తలవంచిన పొట్టేలును సరిగా గమనించకుండా, అలవాటు ప్రకారం, దగ్గరకు వచ్చి తలవంచి నమస్కరించేవాళ్ళను దీవించే ధోరణిలో, పొట్టేలు తలపై తనకుడి చేయిని ఎత్తాడు. ఇది గమనించిన కొందరు సంజీవయ్యను పక్కకు తప్పుకోమని గట్టిగా హెచ్చరించారు. అయినా అతడామాటలు పట్టించుకోక వున్నచోటునుంచి కదలలేదు. ఆ మరుక్షణం పొట్టేలు అతణ్ణి గట్టిగా ఢీకొట్టింది. అంతే, కాశీపండితుడు సంజీవయ్య బోర్లాపడిపోతూ, పొట్టేలును, అక్కడవున్న వాళ్ళందరికీ అర్థమయ్యే సామాన్యపదజాలంతో నానా తిట్లూ తిట్టసాగాడు.

ఇది విన్న వాళ్ళలో, ఒక మాటకారి సంజీవయ్యకు లేచినిలబడేందుకు చేతి ఆసరాయిస్తూ, "నీతో ఎలాప్రవర్తించాలో తెలియని పొట్టేలు ప్రవర్తనకు చాలా విచారిస్తున్నాం. ఐతే, అదే సమయంలో నువ్వు నీమాతృభాషను మరచిపోలేదని తెలిసినందుకు చాలా ఆనందంగా వున్నది!" అన్నాడు.



# భారత సం

*ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు–*
*తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!*

1. ఒకానొక కాలంలో :

## సరస్వతీ నదీ తీరంలో...

దేవనాధుడు తన చేతికర్ర తీసుకుని నదీ తీరంలో నడవడానికి బయలుదేరుతూండగా, "ఈ వార్త చదివావా, తాతయ్యా?" అంటూ సందీపుడు పరిగెత్తుకొచ్చాడు. సూర్యుడు అస్త మించబోతున్నాడు. ఆకాశం బంగారంలా మెరుస్తున్నది. చల్లటి గాలులు ఆ సాయంకాలానికి మరింత హాయిని సమకూరుస్తున్నాయి.

దేవనాధుడు ఆగాడు. జీవితకాలమంతా చరిత్ర పాఠాలు చెబుతూ వచ్చాడాయన. ప్రాచీన భారత చరిత్రలో ఎన్నో పరిశోధనలు చేసి, ఇటీవలే పదవీ విరమణ చేసిన విశ్వవిద్యాలయ ఉపన్యాసకుడు దేవనాధుడు. ఆయన ఎందరో విద్యార్థులను చూశాడుగాని, ఇంకా పాఠశాలను కూడా దాటని సందీపుడిలా ప్రతి విషయం పట్లా అమిత ఆసక్తిని కనబరిచే విద్యార్థులను ఎన్నడూ చూడలేదు. సందీపుడు రోజూ ఏవేవో కొత్త కొత్త సందేహాలు అడిగేవాడు. దేవనాధుడు వాటికన్నిటికీ ఓపిగ్గా, వివరంగా సమాధానాలు చెప్పేవాడు. తనకు తెలియని విషయాలను గురించి అడిగినట్టయితే, ఎంతో వినయంగా తాను కూడా ఆ విషయాలను గురించి తెలుసుకోవడానికిప్రయత్నించేవాడు. ఇద్దరూ కలిసి, దేవనాధుడి గదిలోని ముఖ్యమైన పుస్తకాలను తీసి చూసి మరీ తెలుసుకునేవారు. దేవనాధుడు, "నేను మళ్ళీ మళ్ళీ చదివి నిదానంగా ఆలోచించి, ఇంకా వివరంగా తెలుసుకునే కొద్దీ, నాకు ఏమీ తెలియదనే విషయం తెలుసుకునేవాణ్ణి," అనే ప్రముఖ ఫ్రెంచి తత్వవేత్త వాల్టేర్ మాటలను తరచూ చెబుతూ ఉండేవాడు. సందీపుడికి దేవనాధుడంటే అభిమానమూ, భక్తి గౌరవాలూ ఉన్నాయి. ఆయనలో మంచి మిత్రుణ్ణీ, మార్గదర్శినీ చూశాడు సందీపుడు.

"రా, నాయనా! ఇవాళ నా కోసం ఏంవింత వార్త తెచ్చావు?" అని అడిగాడు దేవనాధుడు.

"తాతయ్యా! మన ప్రాచీన గ్రంథాలు సరస్వతీ నదిని గురించి చెబుతాయి. అయితే దాని జాడ మనకు ఎక్కడా కనిపించదు. ఆ పేరుతో నది అంటూ లేదని ఇటీవల ఒక పెద్దమనిషి బల్లగుద్ది మరీ చెప్పాడు. అయితే, ల్యాండ్‌స్టట్ అనే ఒక శాటిలైట్ ఆ నదీమార్గాన్ని ఫోటోతీసిందని ఈ పత్రిక చెబుతోంది. హిమాలయాలలో పుట్టి ప్రవహించిన ఆ నది వెడల్పు పద్నాలుగు కి.మీ. ఉండేదని ఇందులో రాశారు!" అన్నాడు సందీపుడు.

"అవును, నిజమే నాయనా! మరో ముఖ్య విషయం ఏమంటే కొన్ని సంవత్సరాలకు పూర్వమే పాల్ హెన్రీ ఫ్రాంక్ ఫోర్ట్ అనే సుప్రసిద్ధ పురాతత్వ పరిశోధనావేత్త ఈ నదిని గురించి పరిశోధనలు జరిపాడు. బహుశా అనావృష్టి కారణంగా అది దాదాపు నాలుగు వేల సంవత్సరాలకు పూర్వమే ఎండిపోయి కనుమరుగై వుంటుందని ఆయన అభిప్రాయపడ్డాడు. నది

స్మృతి-చరిత్ర

ఎండిపోవడానికి మరేవైనా కారణాలు కూడా వుండవచ్చు. ఒక్క సరస్వతీ నది మాత్రమే అలా అదృశ్యమై పోలేదు. దృశద్వతి నది కూడా దానిలాగే కాలగర్భంలో కనుమరుగై పోయింది!" అన్నాడు దేవనాథుడు.

"మరి అలాంటి నదులు అసలు ఎప్పుడూ లేనేలేవని వాదించడం విడ్డూరం కాదా తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు.

"కాదు. ఎందుకంటే మన గత చరిత్ర గురించి మనకు అంతగా తెలియదు. వందలాది సంవత్సరాలు మనం ఒక విధమైన బద్ధకంతో జీవితాలు గడిపేశాం. పరిశోధనలన్నా, అన్వేషణలన్నా మనకు అసలు గిట్టవు. అయితే, పాశ్చాత్య దేశాల నుంచి వచ్చిన కొందరు పరిశోధకులు ఈ విషయంలో మనకెంతో మేలుచేశారు. సాంచీ స్థూపాన్ని గురించీ, అజంతా, ఎల్లోరా గుహల చిత్రకళా నిధులను గురించీ ఎన్నో విలువైన విషయాలను వెలుగులోకి తెచ్చారు. మన తాళ పత్ర గ్రంథాలెన్నిటినో పరిశోధించి వాటిలోని విజ్ఞాన నిధులను వెలికితీశారు. అయితే, అదేవిధంగా వాళ్ళు కొన్ని నిజంకాని చారిత్రక సిద్ధాంతాలను కూడా ప్రచారంలోకి తెచ్చారు. ఉదాహరణకు చెప్పాలంటే—చాలాకాలం పూర్వం ఆర్యులు మనదేశంపై దురాక్రమణ జరిపి స్థానికులైన ద్రావిడులతో యుద్ధంచేశారని చెప్పారు. మన చరిత్రకారులూ, ఉపాధ్యాయులూ ఆ సిద్ధాంతంలోని నిజానిజాలను పరీక్షించకుండా అలాగే అంగీకరించారు. దానినే ఇంకా, మనం పాఠ్యపుస్తకాలలో చదువుతున్నాం. బోధిస్తున్నాం! అయితే, ఇవాళ చిత్తశుద్ధిగల ఏ పరిశోధకుడికైనా ఈ సిద్ధాంతాన్ని బలపరచడానికి లవలేశం కూడా ఆధారాలు లేవని ఇట్టే తెలిసిపోతుంది. పైగా ఆ సిద్ధాంతం వల్ల మనదేశానికి పెద్దహాని కూడా వాటిల్లింది. ఎందుకంటే దానివల్లే మనం మనల్ని రెండు భిన్నమైన జాతులకు చెందిన వాళ్ళుగా భావించడం మొదలు పెట్టాం!" అన్నాడు దేవనాథుడు.

"అదిసరే, తాతయ్యా! అనావృష్టి కారణంగా సరస్వతీ నది ఎండిపోయిందే అనుకుందాం. మరి, ఆ నదీ తీరంలో నివసించిన ప్రజలు ఏమైవుంటారు?" అని అడిగాడు సందీపుడు తీవ్రంగా ఆలోచిస్తూ.

"వాళ్ళుచాలా కష్టాలనే ఎదుర్కొని వుండాలి! నది ఎండిపోవడం అన్నది హఠాత్తుగా, ఒక్క



సారిగా జరిగివుండదు. అక్కడి వాళ్ళు కూడా క్రమేణా పచ్చగావున్న కొత్త ప్రాంతాలను వెతుక్కుంటూ తరలి వెళ్ళివుంటారు. మనది సువిశాలదేశం గనక భూములకు లోటులేదు. అయితే సరస్వతీ నదీతీరంలో వాళ్ళు పెంచి పోషించిన సంస్కృతీ సాహిత్యాలు తరగని సంపదలుగా మిగిలి ఉన్నాయి. మనదేశ విశిష్టతను చాటుతున్నాయి. వాటిని వేదాలు అంటారు. వేదాలు నాలుగు. అవి ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం!'' అన్నాడు దేవనాథుడు.

''వాళ్ళు వెళ్ళిన ప్రాంతాలకు తమవెంట ఆ పుస్తకాలను తీసుకువెళ్ళారా, తాతయ్యా?''అని అడిగాడు సందీపుడు. దేవనాథుడు చిన్నగా నవ్వి, ''అవును, తీసుకువెళ్ళారు. అయితే పుస్తకాల రూపంలో కాదు తమ జ్ఞాపకశక్తితో.



వాళ్ళకు రాయడం తెలుసు. అయినా, వేద మంత్రాలను వల్లిస్తూ, కంఠస్థం చేసి జ్ఞాపకం వుంచుకోవడమే సంప్రదాయంగా ఆచరించారు!'' అన్నాడు.

''నమ్మశక్యంగాలేదు!'' అన్నాడు సందీపుడు.

''మనకు నమ్మశక్యం కాదు. అయినా అది నిజం! ఆనాటి వాళ్ళ జీవనశైలి మనకు పూర్తిగా భిన్నమైనది. ఆనాటి ప్రజలందరికీ వేదాలు కంఠతా వచ్చునని నేను అనడంలేదు. అయితే అలా జ్ఞాపకం వుంచుకున్న వారిని ఋషులు అనేవారు. వారే సమాజానికి గురువులు. వారికి అద్భుతమైన ఏకాగ్రత, జ్ఞాపకశక్తి ఉండేవి. వేదమంత్రాలను బాల్యంనుంచే స్వరయుక్తంగా విని, మళ్ళీ మళ్ళీ వల్లెవేసి కంఠస్థం చేసేవారు!'' అన్నాడు దేవనాథుడు

''ఎందుకు అంతగా శ్రమపడేవారు, తాతయ్యా!'' అని అడిగాడు సందీపుడు.

''ఆ ప్రశ్నవేస్తావని అనుకుంటూనే ఉన్నాను సందీపా. మనం దేనికోసమైనా శ్రమపడాలని నిర్ణయించుకున్నామంటే—అందులో ఏదో ఒక ఆనందం, ప్రయోజనం ఉండి తీరుతాయి. అయితే ఋషులు క్షణికమైన ఆనందాన్నిగానీ, అశాశ్వతమైన ప్రయోజనాన్ని గానీ ఆశించారని చెప్పలేము. జీవితంలో ఎదురయ్యే ముఖ్యమైన సమస్యలనూ, చిక్కులనూ పరిష్కరించే సమాధానాలకోసం నిరంతర అన్వేషణ సాగించారు. మనం ఎందుకు జీవిస్తున్నాం? మరణం తరవాత మనిషికి ఏమవుతుంది? బాధలకు మూలకారణం ఏమిటి? ఇలా ఎన్నెన్నో ప్రశ్నలకు సమాధానాలు వెతికారు. అటువంటి ప్రశ్నలకు వేదాలలో సమాధానాలు



ఉన్నాయని విశ్వసించారు!" అన్నాడు దేవనాథుడు.

"అవునూ, వేదాలను ఎవరు రాశారు?" అని సందీపుడు అడిగాడు.

"అదే నిగూఢ రహస్యం! మనం పుస్తకాలు, ఉత్తరాలు రాసినట్టు వేదాలను ఎవరూ రాయ లేదు. ఋషులు వాటిని విన్నారు. అందుకే వాటిని శృతులు అని అంటారు. అంటే విన్నవి అని అర్థం. ఉన్నత స్థాయినుంచి మానవ చేతనకు అద్భుత సత్యాలు గొప్ప పదాలుగా, స్ఫూర్తి వాక్యాలుగా దిగివచ్చాయని ఋషులు విశ్వసించారు!" అన్నాడు దేవనాథుడు.

"అటువంటి సత్యాలు నా హృదయంలోకీ దిగిరావాలని కోరుకోవచ్చా?" అని అడిగాడు సందీపుడు ఆశ్చర్యంగా.

"తప్పకుండా! వారూ మనలాంటి మను షులే సందీపా! వారికి జరిగిందంటే నీకూ జరగ వచ్చు. జీవుడు మరణం తరవాత ఏమవుతాడు? అన్న రహస్యాన్ని కనుగొన్నప్పుడు నచికేతుడు నీకన్నా చిన్నవాడే!" అన్నాడు దేవనాథుడు.

"నచికేతుడా? ఆ పేరు ఎప్పుడో విన్నట్టుందే!" అన్నాడు సందీపుడు.

"అంతేనా? శతాబ్దాల తరబడి ఆ పేరు ఎందుకు నిలిచివుందో తెలుసా?" అని అడి గాడు దేవనాథుడు.

"తెలియదు!" అన్నాడు సందీపుడు.

"వేదాల చివరి భాగాలు ఉపనిషత్తులు. వాటిలో ముఖ్యమైన కఠోపనిషత్తులో నచికేతుడి కథ చెప్పబడింది. నచికేతుడి తండ్రి వాజ శ్రవసుడనే ముని యజ్ఞం తలపెట్టి, తన వద్దనున్న సర్వస్వాన్నీ దానం చేస్తూ వచ్చాడు. పక్కనే వుండి దానిని చూసిన నచికేతుడు, "నాన్నా! మీ దగ్గరవున్నదంతా దానం చేస్తున్నారే! మరి నన్నెవరికిస్తారు?" అని అడిగాడు.

ఆయన దానికి మొదట సమాధానం చెప్పలేదు. నచికేతుడు రెండవసారి అడిగాడు. ఆయన అప్పుడూ ఊరుకున్నాడు. నచికేతుడు మూడవసారి అడగడంతో ఆయన, "యముడి కిచ్చేస్తా!" అన్నాడు విసుగ్గా.

నచికేతుడు తిన్నగా యమలోకానికి వెళ్ళాడు. సమయానికి యముడు అక్కడ లేడు. మూడు రోజులు నిద్రాహారాలు మాని యముడి రాక కోసం నిలబడ్డాడు నచికేతుడు. అతని పట్టు దలకూ, ఓర్పుకూ సంతోషించిన యముడు అతన్ని మూడు వరాలు కోరుకోమన్నాడు.

"నేను కనిపించక పోయేసరికి పరితపిస్తున్న మా తండ్రికి మనశ్శాంతి ప్రసాదించు!" అన్నాడు నచికేతుడు.





"అలాగే ఇచ్చాను!" అన్నాడు యముడు.

సంతోషంగా, "ఆకలి దప్పులు, జరామరణాలు లేని స్వర్గ జ్ఞానంప్రసాదించు," అని అడిగాడు నచికేతుడు.

"అలాగే!" అని వివరించి, "మరి మూడవ వరం?" అని అన్నాడు యముడు.

"మరణం తరవాత జీవుడు ఏమవుతాడు? మరణ రహస్యం నాకు తెలియజెయ్యి!" అన్నాడు నచికేతుడు

ఇంత చిన్నవాడినుంచి అంత పెద్ద ప్రశ్న వస్తుందని యముడు ఊహించలేదు. "నాయనా, ఇది సామాన్యులు తెలుసుకోతగిన విషయంకాదు. చక్కటి జీవితం, సిరిసంపదలు, ఏంకావాలన్నా కోరుకో, ఇస్తాను," అన్నాడు యముడు.

"దయామయా! అవన్నీ అశాశ్వతాలు. నాకు ఆనందం కలిగించవు. మరణ రహస్యాన్ని తెలియజేసి కరుణించు. అదొక్కటే చాలు!" అని ప్రార్థించాడు నచికేతుడు.

నిత్యమూ, నిర్మలమూ అయిన ఆత్మ ఒక దేహం నుంచి వేరొక దేహానికి చేరే రహస్యాన్ని యముడు నచికేతుడికి వివరించాడు. నచికేతుడు ఆత్మజ్ఞానం పొంది పరమానందంతో స్వగృహానికి తిరిగివచ్చాడు. ఆయన కూడా గొప్ప ఋషిగా పేరుగాంచాడు," అన్నాడు దేవనాథుడు.

"యమలోకానికి వెళ్ళిరావడం అన్నది వాళ్ళకు నిజంగానే సాధ్యమయ్యేదా, తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు నవ్వుతూ.

"ఇలాంటి కథలను కేవలం ఇతివృత్తాలుగా మాత్రమే తీసుకోకూడదు. అంతర్లీనంగా ఉన్న గొప్ప సందేశాలను అర్థం చేసుకోవాలి. నిజానికి తపోసంపన్నుడైన వాజశ్రవసుడు, అంత సులభంగా సహనం కోల్పోయి, కన్నబిడ్డను యముడికి అప్పగించేంత కోపిష్ఠి అయి వుండడు. అలా ప్రవర్తించి వున్నట్టయితే ఆయనకు ఉపనిషత్తులలో స్థానం లభించేది కాదు. ఆయన తన కుమారుడికి గొప్ప బాధ్యతను అప్పగించాడనే నేను భావిస్తున్నాను. ధ్యానం ద్వారా మరణ రహస్యాన్ని తెలుసు కోమని ఆయన తన కుమారుణ్ణి ఆదేశించి ఉంటాడు. నచికేతుడు దానిని గురించి మూడురోజులు నిద్రాహారాలుమాని ధ్యానంలో గడిపి వుండవచ్చు. ధ్యానానంతరం ఆయన హృదయంలో ఆత్మమరణం లేనిది; శాశ్వత మైనది అన్న పరమసత్యం స్ఫురించి ఉండ వచ్చు!" అని వివరించాడు దేవనాథుడు.

"అద్భుతం!" అంటూ సందీపుడు ఆయనకేసి ఆనందాశ్చర్యాలతో చూశాడు. —(ఇంకావుంది)



# తలకాడు ఇసుక దిబ్బలు

రచన : జయంతి మహాలింగం

చిత్రాలు : గౌతమ్ సేన్




సోమనాథపురానికి పన్నెండు కి.మీ. దూరంలో కాబిని అనే కపిలానది కావేరీలో సంగమిస్తున్నది. సంగమం సమీపంలో తిరుమకూడల నరసీపుర అనే చిన్న పట్టణం ఉన్నది. త్రికూడలు (మూడు సంగమాలు)అనే మాట క్రమంగా తిరుమకూడలు అయింది. ఇక్కడ స్ఫటిక సరోవరం అంతర్వాహినిగా కావేరీనదిలో సంగమిస్తున్నది అని ఒక విశ్వాసం!

టి. నరసీపురంలో ప్రాచీనమైన అగస్త్యముని ఆలయం ఉన్నది. ఇదొక ముఖ్యమైన యాత్రాస్థలం. టి. నరసీపురానికి కొంత దూరంలో కావేరీ ఎడమ గట్టున నిర్మానుష్యంగా ఇసుక దిబ్బలు నిండిన తలకాడు పట్టణం ఉన్నది. ఒకప్పుడిది గాంగ వంశీయులకు రాజధానిగా ఉండేది. ఆ తరవాత చోళుల వశమయింది. దానికి రాజరాజపురం అని నామకరణం చేశారు. ఆ పిమ్మట ఇది విష్ణువర్ధనుడి కాలంలో హోయసాలుల ఏలుబడిలోకి వచ్చింది. అయితే ఇప్పుడు ఈ పట్టణం ఇసుక దిబ్బల కింద కూరుకుపోయి ఉన్నది. ఒక్కొక్క చోట ఇసుక దిబ్బల ఎత్తు 15 మీ॥ వరకు ఉన్నది. తలకాడుకు పట్టిన ఈ దుస్థితికి కారణం ఒక రాణి శాపం అని చెప్పే ఒక విచిత్ర గాథ ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్నది.

శ్రీరంగపట్నంలో విజయనగర సామ్రాజ్యానికి కట్టకడపటి రాజప్రతినిధిగా తిరుమల రాయుడనే పాలకుడు ఉండేవాడు. ఆయన భార్య రాణి అలమేలమ్మ. తిరుమలరాయుడి మరణానంతరం—ఆయన భార్య అలమేలమ్మ దగ్గరవున్న అపురూపమైన నగలను దోచుకురమ్మని—మైసూరు పాలకుడు రాజా ఉడయార్ తన సైనికులను పంపాడు. ఈ సంగతి తెలిసిన రాణి అలమేలమ్మ కావేరీనదికి ఆవలి గట్టున వున్న మాలంగికి తప్పించుకుని వెళ్ళాలని బయలుదేరింది. అయినా, శత్రు సైనికులు ఆమెను


అలమేలమ్మ
మూడు శాపాలిచ్చింది!

వదలకుండా వెంబడించారు. దాంతో ఆమె తన ఒంటి నిండా నగలతో కావేరీ నదిలోకి దూకింది. నీళ్ళలోకి మునిగి పోతూ ఆమె అమితావేశంతో మూడు శాపాలు పెట్టింది: "తలకాడు ఇసుక దిబ్బలతో నిండిపోవుగాక! మాలంగి సమీపంలో సుడిగుండం ఏర్పడుగాక! మగదిక్కు కోల్పోయిన నాపై ఇంత దుర్మార్గానికి పాల్పడిన మైసూరు పాలకులకు వారసులు లేకుండా పోదురుగాక!"

రాణి అలమేలమ్మ శాపాలు నిజంగానే ఫలించాయని ఈ ప్రాంత ప్రజలు పలువురు విశ్వసిస్తున్నారు.


తలకాడు వైదీశ్వరాలయం.

తలకాడు ఇసుక దిబ్బలతో నిండిపోయింది. మాలంగి సమీపంలో సుడిగుండం ఏర్పడింది. మైసూరు రాజుల వంశవృక్షాన్ని పరిశీలిస్తే అందులో పలువురు దత్తత స్వీకరించిన విషయం తెలుస్తుంది.

ఇసుకదిబ్బలలో దాదాపు ముప్ఫై దేవాలయాలు పూడిపోయాయని చెబుతారు. అక్కడక్కడ కొన్ని దేవాలయాలు పైకి కనిపిస్తున్నాయి. గాంగ వంశీయులు నిర్మించిన పాతాళేశ్వర, మరుళీశ్వర ఆలయాలు; హోయసాలులు నిర్మించిన కీర్తినారాయణ మందిరం; చోళులు నిర్మించిన వైదీశ్వర ఆలయం వాటిలో ముఖ్యమైనవి. ఈ ఆలయాలలో ఇంకా పూజలు జరుగుతున్నాయి. పన్నెండు సంవత్సరాలకు ఒకసారి నవంబర్-డిసెంబర్ నెలల మధ్య జరిగే పంచ లింగ


ఏనుగులు చెట్టును పూజించడం వేటగాళ్ళు గమనించారు.

దర్శన ఉత్సవ సమయంలో మరీ విశేషంగా పూజలు జరుపుతారు. ఈ సమయంలో మాత్రమే వేలాది భక్తులు తలకాడు చేరుకుంటారు.

పాతాళేశ్వర, మరుళీశ్వర ఆలయాలు చాలా పురాతనమైనవి. పాతాళేశ్వర ఆలయంలోని శివలింగం రంగు ఉదయం ఎర్రగా, మధ్యాహ్నం నల్లగా, సాయంకాలం తెల్లగా మారుతుందని చెప్పుకుంటారు.

కీర్తినారాయణ మందిరంలోని మూడు మీటర్ల ఎత్తయిన విష్ణు విగ్రహం ఈనాటికీ పూజలందు కుంటున్నది.

తలకాడులోని అతి పెద్ద ఆలయం వైదీశ్వరదేవాలయం. పధ్నాలుగవ శతాబ్దంలో నిర్మించబడిన ఈ శివాలయానికి సంబంధించిన పురాణగాథ ఒకటి ప్రచారంలో ఉన్నది:

సోమదత్తుడనే ముని తన శిష్యులతో కలిసి కావేరీతీరంలో శివారాధనకు పూనుకున్నాడు. ఆయన పూజావ్రతం పూర్తికావడానికి ముందే అడవిలోని ఏనుగుల చేత, శిష్యులతో సహా హతుడయ్యాడు. మరుజన్మలో వాళ్ళు అదే అడవిలో ఏనుగులుగా పుట్టారు. వాళ్ళను అనుగ్రహించడానికి శివలింగాకారంలో ఒక పత్తిపట్టు చెట్టుకింద శివుడు ఆవిర్భవించాడు. ఏనుగులు రెండూ ప్రతి ఉదయం కావేరీనదిలో స్నానం చేసి, తామర పువ్వులను తెచ్చి చెట్టు బోదె దగ్గర ఉంచసాగాయి. దీనిని తల, కాడు అనే వేటగాళ్ళు గమనించారు. వాళ్ళు ఒకనాడు చెట్టును మొదలంట నరకడానికి పూనుకున్నారు. అయితే, బోదెకు తొలిగొడ్డలివేటు పడగానే చెట్టునుంచి రక్తం స్రవించసాగింది. మరుక్షణమే ఆ చెట్టు ఆకులతో, పళ్ళతో గాయం దగ్గర కట్టుకట్టమని అశరీరవాణి వినిపించింది. వేటగాళ్ళు అదేవిధంగా చేశారు. వెంటనే రక్తం పాలుగా మారింది. ఆ పాలు తాగిన వెంటనే వేటగాళ్ళూ, ఏనుగులూ అమరత్వం పొందారు. కొన్నాళ్ళ తరవాత ఆలయం నిర్మించబడింది. వేటగాళ్ళ పేరుమీదుగానే ఆ స్థలానికి తలకాడు అనే నామం స్థిరపడిపోయింది.

ఎడారి అడవిని హరించుకుంటూ ముందుకు రాకుండా అరికట్టడానికి అటవీశాఖ అధికారులు చెట్లు నాటిస్తున్నారు. అయినా ఏడాదికి కనీసం 3 మీ॥ ప్రకారం ఎడారి అడవిని ఆక్రమిస్తూనే వున్నది. కావేరీ నదిలో కొట్టుకు వచ్చే రేగడి, ఇసుక ఒడ్డుకు చేరుతుంది. వేసవికాలంలో నైరుతీ రుతుపవనాల సమయంలో మన్నూ ఇసుకా పట్టణం వైపుకు చిమ్మబడతాయి. కావేరీ తన ప్రవాహమార్గాన్ని మార్చుకోవడం



నరసీపుర సమీప సంగమం



గంగాచుక్కి జలపాతం

వల్లకూడా ఇసుక మేటలు ఏర్పడి ఉండవచ్చని కొందరు చెబుతారు. దైవ అగ్రహమో, ప్రకృతి శాపమో చెప్పలేముగాని తలకాడు మాత్రం ఈరోజు అందరూ మరిచిపోయిన పట్టణంగానే మిగిలిపోయింది. అరుదుగా తప్ప ఈ పట్టణాన్ని దర్శించటానికి యాత్రికులు రావడంలేదు.

తలకాడుకు 25 కి.మీ. ఉత్తరంగా కావేరీ నది రెండవ పెద్దద్వీపమైన శివసముద్రాన్ని ఏర్పరుస్తున్నది. శింశా అనే ఉపనది ఇక్కడ కావేరిలో సంగమిస్తున్నది. ఇక్కడ రంగనాథ ఆలయాన్ని మధ్యరంగ అని అంటారు. దట్టమైన అడవులతో 4.8 కి.మీ. పొడువు 1.2 కి.మీ వెడల్పు కలిగిన ఈ ద్వీపాన్ని ప్రధాన భూభాగం నుంచి 474 మీ॥ పొడవైన లషింగ్టన్ బ్రిడ్జ్ గుండా చేరుకోవచ్చు. ఈ వంతెన 150 సంవత్సరాలకు పూర్వం నిర్మించబడింది. నది రెండు శాఖలుగా చీలి ద్వీపాన్ని ఏర్పరుస్తున్నది. రెండు శాఖలూ దాదాపు 100 మీటర్ల ఎత్తునుంచి కిందికి ఉరుకుతున్నాయి. పశ్చిమ శాఖ 90 మీ॥ ఎత్తు రాతికొండల నుంచి కిందికి ఉరుకుతున్నది. దీన్ని గగనచుక్కి జలపాతం అని అంటారు. తూర్పు శాఖ 69 మీ॥ ఎత్తునుంచి జారుతున్నది. దీన్ని భారచుక్కి జలపాతం అంటారు. రెండింటినీ కలిపి కావేరీ జలపాతాలు అంటారు. పచ్చటి చెట్లు చేమల మధ్య ఈ జలపాతం చూపరులకు కనులవిందు చేస్తుంది.

శివసముద్రం మన దేశంలో ప్రప్రథమంగా (1902వ సం॥లో) నిర్మించబడిన జలవిద్యుత్ కేంద్రం అనే విశిష్టతను సంతరించుకున్నది. 147 కి.మీ దూరంలో వున్న కోలార్ బంగారు గనులకు విద్యుత్ సరఫరా చేయడానికి ఈ కేంద్రాన్ని రూపొందించారు. 1930 ప్రాంతంలో తమిళనాడులో మెట్టూర్ డ్యాం నిర్మించినప్పుడు దానికి అవసరమైన విద్యుత్తును ఇక్కడి నుంచే సరఫరా చేశారు. 135 మీ॥ ఎత్తయిన కొండ శిఖరంపై నుంచి విద్యుత్ కేంద్రం జెనరేటర్‌లలోని టర్బైన్స్‌కు కావలసిన హైడ్రాలిక్ పైప్స్ అమర్చడానికి చాలా అనుకూలంగా ఉన్నది. 1883-1901 మధ్యకాలంలో మైసూరు దివానుగా పనిచేసిన కె. శేషాద్రి అయ్యర్ పేరును ఈ కేంద్రానికి పెట్టారు. ఆయన కాలంలోనే ఈ జలవిద్యుత్ కేంద్రానికి రూపకల్పన చేయబడింది. పర్యాటకులు 435 మీటర్ల దూరం ట్రాలీలో కిందికి వెళ్ళి విద్యుత్ కేంద్రం చేరుకోవచ్చు.

ముస్లిం భక్తుడు పీర్ షైబ్ దర్గా వెనకవైపు నుంచి చూస్తే, అద్భుతమైన గగనచుక్కీ దృశ్యం కనిపిస్తుంది. పచ్చటి చెట్లమధ్య తెల్లటి హారంలా మెరుస్తూ ఈ జలపాతం కనులవిందు చేస్తుంది. ఇక్కడి నుంచి శింశా జలవిద్యుత్ కేంద్రం కూడా కనిపిస్తుంది. ఇక్కడికి కొంచెం ఈశాన్య దిశలో సతేగాలా వద్ద కావేరీ నది రెండు శాఖలూ మళ్ళీ ఒకటిగా కలుస్తాయి.



# అల్లుడు-కొడుకు

సీతారామయ్య అతిథి సత్కారానికి పెట్టింది పేరు. చింతలపూడికి కొత్తగా ఎవరొచ్చినా, ఆయన ఇంట బస చేసి వెళ్ళాల్సిందే! ఆ విధంగా ఒకసారి ఆయన ఇంటికి సుకాముడనే యువకుడు వచ్చాడు. వాడికి కవిత్వం చెప్పడం వచ్చు. సంగీతమూ తెలుసు. కళాకారుల నాదరించే భాగ్యనగరంలో, తన అదృష్టాన్ని పరీక్షించుకుందామని బయల్దేరాడు.

సుకాముడు చెప్పింది విన్నాక, సీతారామయ్య, "ఆ నగరంలో నాకు తెలిసిన వాళ్ళిద్దరున్నారు. వారిలో మోహనుడు నాకు తెలిసిన పంధామయ్య అల్లుడు. వాడు మంచి కవి. ఉపకారగుణ మున్నవాడు. నగరంలో కొంత పలుకుబడి కూడా సంపాయించాడు. కవిగా నీకక్కడ స్థిరపడడానికి తప్పక సాయపడతాడు. రెండోవాడు విశాలుడు, మా రెండో అబ్బాయి. వాడు చెప్పుకోతగ్గ గాయకుడు. ఉపకారగుణంలోనూ, పలుకుబడిలోనూ వాడు కూడా మోహనుడంతటివాడు. నువ్వు వాళ్ళను కలుసుకో. పని జరుగుతుంది," అన్నాడు.

ఇందుకు సుకాముడెంతో సంబరపడి, "భాగ్యనగరం చేరేలోగానే నా పని సుకరమైంది. మీ పేరు చెప్పుకుని అక్కడ స్థిరపడతాను," అన్నాడు.

దీనికి సీతారామయ్య వెంటనే అభ్యంతరం చెబుతూ, "మోహనుడికీ, విశాలుడికీ కూడా తమకు తామే సాటి అనుకునే గర్వమున్నది. నేను చెప్పగా వారి గొప్పతనాన్ని తెలుసుకున్న నిన్ను, వాళ్ళాదరించరు. నా పేరు చెప్పకుండా పూరుకున్నావంటే, వాళ్ళు నీకు అన్ని విధాలా సహకరిస్తారు. ఉపకారగుణమున్న వారికి, ఆమాత్రం గర్వం వుండడం

"వసుంధర"

తప్పుకాదు కాబట్టి, ఈ లోపానికి నేను కానీ, నువ్వు కానీ వాళ్ళను తప్పు పట్ట కూడదు," అన్నాడు.

సుకాముడిందుకు సరేనని భాగ్య నగరం చేరుకోగానే, ముందుగా మోహను డింటికి వెళ్ళాడు. సీతారామయ్య చెప్పింది గుర్తుంచుకుని వాడు, మోహనుడితో, "అయ్యా, ఉత్తమ కవిత్వాన్ని అంచనా వేయడంలోనూ, కవులకు ఉపాధి కల్పించడంలోనూ తమకు తమరే సాటి అని, ఎక్కడెక్కడో చెప్పుకుంటూంటే విని మిమ్మల్ని చూడవచ్చాను. నన్ను పరీక్షించి, ఇక్కడ స్థిరపడే అవకాశం నాకు కలిగించ వలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను," అన్నాడు స్వయంగా.

మోహనుడు ఉబ్బిపోయి, "ముందుగా మా మామగారు పరంధామయ్యగారి మీద చక్కని పద్యం చెప్పు. దాన్ని బట్టి నీ సామర్థ్యాన్ని అంచనావేస్తాను," అన్నాడు.

పరంధామయ్యగారి వంశవృక్షం గురించీ, ఆయన సాధించిన ఘనకార్యాల గురించీ అడిగి తెలుసుకున్నాక—సుకా ముడు సీసపద్యానికి తేటగీతిని జత పరుస్తూ చక్కని పద్యాన్ని చదివాడు.

"ఆశువుగా ఇంత చక్కని పద్యాన్ని చెప్పగలిగిన కవికి వేరే పరీక్ష అవసరం లేదు. ఈ నగరంలో కళాశేఖరుడనే భాగ్య వంతుడున్నాడు. ఆయన కళాప్రియుడు, నాకు మిత్రుడు. నిత్యం తననే అంటి పెట్టుకుని వుంటూ కవిత్వాన్ని వినిపించే సహచరుడి కోసం ఆయన అన్వేషి స్తున్నాడు. నేను యోగ్యుడని పంపిన వాడికాయన తప్పక తనవద్ద అవకాశం ఇస్తాడు," అన్నాడు.

మోహనుడిచ్చిన ఉత్తరం తీసుకున్నాడు సుకాముడు. తర్వాత విశాలుడింటికి వెళ్ళి, మోహనుణ్ణి పొగిడినట్టే అతణ్ణి పొగిడాడు. విశాలుడుబ్బిపోయి, "నా వద్ద నా తండ్రి సీతారామయ్యపై నా అన్న రాసిన సీసపద్యమొకటున్నది. దానికి చక్కని వరసకట్టి పాడగలిగితే, నీ సామర్థ్యాన్ని అంచనా వేయగలను," అన్నాడు.





సుకాముడు, విశాలుడిచ్చిన పద్యానికి వెంటనే వరసకట్టి పాడగానే, విశాలుడు మురిసిపోయి, "నిస్సందేహంగా నువ్వు ప్రజ్ఞాశాలివి. ఈ నగరంలో కళాశేఖరుడనే భాగ్యవంతుడున్నాడు. ఆయన కళా ప్రియుడు, నాకు మిత్రుడు. నిత్యం తననే అంటి పెట్టికుని సంగీతం వినిపించే సహచరుడి కోసం, ఆయన అన్వేషిస్తున్నాడు. నేను యోగ్యుడని చెప్పిన వాడికాయన తప్పక అవకాశం యిస్తాడు. ఆయన వద్ద చేరావంటే, నీకిక వసతికీ, భుక్తికీ, ఆదా యానికీ కూడా లోటుండదు," అంటూ వాడికొక లేఖ ఇచ్చాడు.

సుకాముడు, కళాశేఖరుణ్ణి కలుసు కున్నాడు. ఆయన వాడిచ్చిన లేఖలు చదివి, "అడ్డమైన వాళ్ళూ కవులమనీ, గాయకులమనీ చెప్పుకుంటూ నావద్దకు వచ్చి, పరమ చెత్తను సాహిత్యమనీ, రణగొణ ధ్వనులను సంగీతమనీ నన్ను భ్రమ పెట్టడానికి ప్రయత్నించారు. విని విని విసిగిపోయిన నేను, నాకు నమ్మకమైన మిత్రులు అర్హుడంటూ రాసిన లేఖలు తెచ్చినవారిని తప్ప, ఇతరులను దరిచేర నివ్వడంలేదు. ఇక నువ్వు నాకు కవిత్వాన్నీ, సంగీతాన్నీ వినిపించవచ్చు," అన్నాడు.

ఈవిధంగా లభించిన సదవకాశాన్ని సుకాముడు సద్వినియోగం చేసుకున్నాడు. కవిత్వంలోనూ, సంగీతంలోనూ కూడా వాడు, కళాశేఖరుణ్ణి మెప్పించి, ఆయన హృదయంలో స్థానం సంపాయించు కున్నాడు.

తనకు బ్రతుకుతెరువేర్పడినందుకు ఎంతో సంతోషించి సుకాముడు, ఆ సందర్భంగా తన శ్రేయోభిలాషులకు విందుభోజనం పెట్టాలనుకున్నాడు. అందుకోసం ముందుగా మోహనుడింటికి



మేలును మరచిపోతాను. అంతా నా ప్రతిభవల్లే జరిగిందనుకుంటాను. అను కోని పరిస్థితుల్లో మిమ్మల్ని నిరసించినా నిరసించవచ్చు. అందుకే–పొందిన ఉప కారానిక్కూడా ప్రచారముండాలి. నేనిప్పు డివ్వబోయే విందుకు తమరూ వస్తారు, తమ బంధువులూ వస్తారు. అందరి సమక్షంలో, మీరు చేసిన మేలును ప్రకటించానంటే–ఆ తర్వాత నేను ఎప్పుడైనా మీ పట్ల నిరసన భావం చూపితే, నలుగురూ నన్నే ఛీ అంటారు. విపరీతమైన గర్వం నన్ను మింగేయకుండా, నేను తీసుకుంటున్న జాగ్రత్త ఇది! కాదనకండి," అన్నాడు సుకాముడు మోహనుణ్ణి బ్రతి మాలుతున్న ధోరణిలో.

వెళ్ళి, "అయ్యా! మీ వల్ల నాకు ఉపాధి లభించింది. నేను ఏర్పాటు చేసే విందు భోజనానికి తమరు సకుటుంబంగా రావాలి. తమరు కాక, తమ ముఖ్య బంధువులు కొందర్ని కూడా పిలిస్తే, వారి ముందు నాకు చేసిన మేలు గురించి చెప్పుకుంటాను," అన్నాడు.

"నువ్వు ప్రజ్ఞాశాలివి కాబట్టి సాయ పడ్డాను. ఇందులో పదిమందికీ చెప్పుకునే దేముందీ?" అన్నాడు మోహనుడు మొహమాటపడుతూ.

"అయ్యా! సమస్త జంతువుల్లోకీ మనిషిని మించిన కృతఘ్నుడుండడు. ఈ రోజు నేను మేలు చేసినందుకు, మిమ్మల్ని పొగుడుతున్నాను. ఇది తాత్కాలికం కావచ్చు. కొంతకాలం గడిచాక, నేను మీ

మోహనుడు, సుకాముడి మాటల కాశ్చర్యపడి, అతడి దూరాలోచననూ, మంచితనాన్నీ మెచ్చుకుని, ఒక కాగితం మీద తన మామ పరంధామయ్య పేరూ, విలాసం రాశాడు. దాని కింద తన బావమరిది గణపతి పేరూ, విలాసం రాశాడు. ఆ కాగితాన్ని సుకాముడి కందించి, "వీరిని నువ్వే కలుసుకుని కారణం చెప్పి స్వయంగా ఆహ్వానిస్తే బాగుం టుంది. నేను చెప్పడం బాగుండదు," అన్నాడు.

"నా అభిప్రాయమూ అదే!" అంటూ సుకాముడు కాగితం చదివి, "అయ్యా! తమరితో కలిపి ఇప్పటికి మూడు కుటుంబాలయ్యాయి. నేను అయిదు కుటుంబాలను ఆహ్వానించాలనుకున్నాను.

ఇంకా రెండు పేర్లు రాయండి," అంటూ బలవంత పెట్టాడు.

అప్పుడు మోహనుడు కాగితం మీద తండ్రి సీతారామయ్య పేరూ, తమ్ముడు విశాలుడి పేరూ విలాసాలతో సహా రాశాడు.

ఆ పేర్లు చూసి సుకాముడిక్కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. మోహనుడు, సీతారామయ్య కొడుకే కాక, విడివిడిగా తాను కలుసుకున్న మోహనుడు, విశాలుడు అన్నదమ్ములై కూర్చున్నారు!

అయితే సుకాముడు, సీతారామయ్య కిచ్చిన మాట తప్పినట్టవుతుందని, సీతారామయ్య తనకు తెలిసినట్టుగా అనకుండా, అక్కణ్ణించి మౌనంగా బయట పడ్డాడు.

తర్వాత అతడు, విశాలుణ్ణి కలుసుకుని మోహనుణ్ణి అడిగినట్టే అడిగాడు. విశాలుడు, వాడికి తండ్రి సీతారామయ్య, అన్న మోహనుల పేర్లూ, విలాసాలూ ఇచ్చాడు. సుకాముడింకా బలవంత పెట్టగా అతడు, తన మామ పరంధామయ్య, బావమరిది గణపతుల పేర్లిచ్చాడు.

అప్పుడు సుకాముడు మరింతగా ఆశ్చర్యపోయాడు. అంటే మోహనుడూ, విశాలుడూ కూడా పరంధామయ్య అల్లుళ్ళేనన్నమాట! అలాంటప్పుడు, సీతారామయ్య వాళ్ళల్లో ఒకరిని పరంధామయ్య అల్లుడనీ, ఇంకొకరిని తన కొడుకనీ ఎందుకు చెప్పాడు? ఆయన ఇద్దర్నీ తన కొడుకులనవలసింది! అలా



గనడం ఇష్టం లేకపోతే, ఇద్దర్నీ పరంధామయ్య అల్లుళ్ళనవలసింది!

కానేపాలోచించగాసుకాముడికి జవాబు దొరికింది. కొడుకులిద్దరికీ గర్వం ఎక్కువంటున్న సీతారామయ్యలో, గర్వం పాలు మరింత ఎక్కువుంది. మోహనుడు తన కంటే భార్య తండ్రికి ప్రాముఖ్యత ఇస్తున్నాడన్న అక్కసుతో, ఆయన అతణ్ణి పరంధామయ్య అల్లుడంటున్నాడు!

వాడు విందుకు సీతారామయ్యను ఆహ్వానించడానికి చింతలపూడి వెళ్ళినప్పుడు, ఆయనతో, "అయ్యా! అహం నన్ను కబళించకూడదని, ఇలా విందు తలపెట్టిన నేను, మీబోటి పెద్దల నుంచి ఎంతో నేర్చుకొనవలసి వుంది. మీరు మీ ఇద్దరి కొడుకులలో ఒకరిని, కేవలం

పరంధామయ్య అల్లుడుగా చెబుతూండడం నాకు సబబుగా తోచలేదు," అన్నాడు.

దీనికి సీతారామయ్య నవ్వి, "నాకు నా ఇద్దరు కొడుకుల్లో ఎవరన్నా ద్వేషభావం లేదు. ఇద్దర్నీ నేను సమంగానే ప్రేమిస్తున్నాను. విశాలుడు వరసకట్టమని నీకిచ్చిన పద్యాన్ని రాసింది, మోహనుడేనని గ్రహించే వుంటావు. వాళ్ళు ఎవరి జీవితాలు వాళ్ళు జీవిస్తున్నారు. మన సంప్రదాయం పెద్దలననుసరించి వుంటుంది. బుద్ధుడి ననుసరించే వాళ్ళు బౌద్ధులు. శివుడి ననుసరించే వాళ్ళు శైవులు. దేవుణ్ణి అనుసరించే వాణ్ణి భక్తుడంటాం. గురువుననుసరించేవాణ్ణి శిష్యుడంటాం. తండ్రిననుసరించేవాడు కొడుకైతే, మామ ననుసరించేవాడు అల్లుడు. మోహనుడు ముందు నా కుమారుడు, ఆ తర్వాతే పరంధామయ్య అల్లుడయ్యాడు, మోహనుడింట మామ కుటుంబానిది ప్రథమ స్థానం. తండ్రి కుటుంబానిది ద్వితీయ స్థానం. కాబట్టి వాణ్ణి పరంధామయ్య అల్లుడనడమే న్యాయం! మనుషుల పేర్లు వారి వారి ప్రవర్తనలకు వ్యాఖ్యానాలని గుర్తుంచుకో! నువ్వు కూడా ఉత్తమ కవిత్వానికి మహాకవుల సంప్రదాయం పాటించడానికి బదులు, కళాశేఖరుడి ఆశ్రయానికే ప్రాముఖ్యతనిచ్చావనుకో. అప్పుడు కళాశేఖరుడి అంతరంగికుడుగానే మిగిలిపోతావు తప్ప, మహాకవివి అనిపించుకోలేవు," అన్నాడు.

సీతారామయ్య మహాజ్ఞాని అనీ, రాగద్వేషాలకు అతీతుడనీ, ఆయన ప్రతి మాటలోనూ ఎంతో ప్రయోజనం దాగి వుందనీ అప్పటికి తెలుసుకున్న సుకాముడు, "అయ్యా! మీ హెచ్చరికను గుర్తుంచుకుంటాను. ఆ విధంగా నా ప్రవర్తనను దిద్దుకుంటాను. గుడ్డిగా ఎవరినీ అనుసరించక, వ్యక్తిత్వం వున్నవాడిలా పేరు తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తాను," అని, ఆయన వద్ద సెలవు తీసుకున్నాడు.



48. శ్రీకృష్ణరాయబారం-2

# మహాభారతం

కృష్ణుడు వస్తున్నాడని హస్తినాపురంలో తెలియగానే ధృతరాష్ట్రుడు భీష్మ ద్రోణులనూ, సంజయ విదురులనూ, దుర్యోధనుణ్ణీ అతని మంత్రులనూ పిలిపించి, "కృష్ణుడు ఇక్కడికి వస్తున్నాడట. ఊళ్ళో అందరూ వింతగా చెప్పుకుంటున్నారు. అతనికి దారిలో అన్ని సదుపాయాలూ ఏర్పాటు చెయ్యండి. అతనికి రకరకాల సత్కారాలు చెయ్యండి," అన్నాడు.

దుర్యోధనుడు హస్తినాపురం నుంచి వృకస్థలం దాకా దారి అంతా అలంకరింపజేసి, అక్కడక్కడా సభలు నిర్మింపజేశాడు. కృష్ణుడు ఆ అలంకరణలనూ, సభలనూ చూడకుండానే హస్తినాపురం చేరాడు. దుర్యోధనుడు తప్ప మిగిలిన ధృతరాష్ట్రుడి కొడుకులూ, భీష్మ ద్రోణాదులైన పెద్దలూ రథాల మీద అతనికి ఎదురు వెళ్ళారు.

కృష్ణుడు ధృతరాష్ట్రుడి మందిరం ముందు రథం దిగి, కాలి నడకన మూడు కక్ష్యలు దాటి, ధృతరాష్ట్రుడి కొలువు కూటం ప్రవేశించాడు. అతను సభలోకి అడుగు పెట్టగానే ధృతరాష్ట్రుడితో సహా అందరూ లేచి నిలబడ్డారు. కృష్ణుడు ముందు భీష్మణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ కుశల ప్రశ్నలతో గౌరవించి, మిగిలిన రాజులందరినీ వయసువారీగా పలకరించాడు. అతను కూర్చోవటానికి ధృతరాష్ట్రుడు బంగారు ఆసనం తెప్పించి వేయించాడు. కృష్ణుడు అక్కడ అతిథి సత్కారాలన్నీ పొంది, కొంతసేపు కబుర్లతో కాలక్షేపం చేసి, అక్కడి నుంచి విదురుడి ఇంటికి వెళ్ళాడు.

ఆ రోజు మధ్యాహ్నం కృష్ణుడు కుంతీదేవిని చూడటానికి ఆమె ఇంటికి వెళ్ళాడు. కుంతీదేవి కృష్ణుడి కంఠం కౌగిలించుకుని,





తన కొడుకులను తలుచుకుని దీనంగా ఏడ్చింది.

ఆమె అతనికి తగిన సత్కారాలు చేసి కూర్చోబెట్టి, "కృష్ణా, నా కొడుకులు నన్నిక్కడ వదిలి, అరణ్యాలకు వెళ్ళారు. నా శరీరం ఇక్కడ ఉన్నదేగాని, నా మనసు వాళ్ళ వెంటే ఉన్నది. తండ్రి లేని ఆ బిడ్డలను నేను ఎంతో గారాబంగా పెంచాను. భయంకరమైన అరణ్యాలలో వాళ్ళు ఎలా జీవించారో? ధర్మరాజు ఎవరూ, ఎన్నడూ మోయనంత ధర్మభారాన్ని మోస్తున్నాడు. అతను క్షేమంగా ఉన్నాడా? భీముడు కులాసాగా ఉన్నాడా? అర్జునుడు కులాసాగా ఉన్నాడా? సహదేవుడు ఎలా ఉన్నాడు? నకులుడు క్షేమమా? వాణ్ణి నేను మళ్ళీ చూస్తానా? నాకు కొడుకుల కన్న ప్రియమైనది ద్రౌపది ఎలా వున్నది? అంత మంచి మనిషి కష్టాలు పడిందంటే పుణ్యాత్ములు సుఖపడతారని ఎలా నమ్మటం?" అన్నది.

కృష్ణుడు కుంతీదేవిని ఊరడించి, "నీ కొడుకులూ, కోడలూ నీకు కనిపిస్తారు. శత్రువులను జయించి వారు నీ దగ్గరికి వస్తారు," అన్నాడు. తరవాత అతను కుంతీదేవి వద్ద సెలవు తీసుకుని దుర్యోధనుడి వద్దకు వెళ్ళాడు.

దుర్యోధనుడి ఇల్లు ఇంద్రభవనం లాగున్నది. దాని పై అంతస్థులో దుర్యోధనుడు రత్నసింహాసనం మీద కూర్చుని ఉన్నాడు. అతని సమీపంలో దుశ్శాసన, కర్ణ, శకునులు కూర్చుని వున్నారు. కృష్ణుడు రాగానే అందరూ లేచి నిలబడి మర్యాద చూపారు. కృష్ణుడు అందరితోనూ కుశలప్రశ్నలు చేసి, ఎవరికి తగినట్టు వారిని పరామర్శించి, తన కోసం ప్రత్యేకంగా వేసిన ఆసనం మీద కూర్చున్నాడు. దుర్యోధనుడు కృష్ణుణ్ణి తన ఆతిథ్యం స్వీకరించమన్నాడు. అందుకు కృష్ణుడు ఒప్పుకోలేదు.

"మా రెండు పక్షాలకూ సహాయపడ్డావు గదా, మేము ప్రేమతో ఇచ్చే ఆతిథ్యం నిరాకరించటానికి కారణమేమిటి?" అని దుర్యోధనుడు కృష్ణుణ్ణి అడిగాడు.

"నేను దూతగా వచ్చిన వాణ్ణి. నేను వచ్చిన పని నెరవేరితే నిరభ్యంతరంగా మీరిచ్చే ఆతిథ్యాన్ని స్వీకరిస్తాను," అన్నాడు కృష్ణుడు.

"మమ్మల్ని గురించి నువ్వు అపోహలు పెట్టుకోరాదు. నువ్వు వచ్చిన పని నెర



వేరినా, నెరవేరకపోయినా కూడా నీకు ఆతిథ్యం ఇవ్వటం మా విధి. అందుచేత నువ్వు మా ఆతిథ్యం స్వీకరించి తీరాలి," అని దుర్యోధనుడు మళ్ళీ అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "ఇష్టమున్నవారితోనూ, ఆపదలో ఉన్నప్పుడూ భోజనం చెయ్య వచ్చు. దుర్యోధనా, నీకు మా పట్ల ప్రీతి లేదు, మేము ఆపదలలోనూ లేము. మాకూ, మీకూ మధ్య వైరం ఉన్నది గనక నువ్వు నాకు ఆతిథ్యం ఇవ్వరాదు, నేను పుచ్చుకోనూ రాదు. నీకు పాండవుల మీద అకారణ వైరం ఉన్నది. వారేమో నాకు ప్రాణాలవంటివారు. వారి వల్ల ఒక్క అధర్మంగాని జరిగినట్టు ఎవరూ చెప్పలేరు. వారిని ద్వేషిస్తున్నావంటే నన్నూ ద్వేషి స్తున్నట్టే! అందుచేత నీ ఆతిథ్యం స్వీక రించమని నన్ను ఒత్తిడి చెయ్యకు," అని చెప్పి అక్కడి నుంచి బయలుదేరి, ద్రోణుడు, కృపుడు, భీష్ముడు మొదలైన వారు వెంటరాగా, విదురుడి ఇంటికి వెళ్ళాడు.

తన వెంట వచ్చిన వారినందరినీ వారి వారి ఇళ్ళకు పంపి, కృష్ణుడు విదురుడి ఇంట భోజనం చేశాడు. భోజనానంతరం కృష్ణుడితో విదురుడు, "కృష్ణా, నువ్వు ఇక్కడికి రావటం అంత మంచిది కాదని నాకు తోస్తున్నది. దుర్యోధనుడు అన్ని ధర్మాలనూ అతిక్రమించాడు. అతని మనస్సు యుద్ధం మీదే ఉన్నది గాని, శాంతి మీద లేదు. కర్ణుడు ఒక్కడే పాండవ బలాలన్నిటినీ గెలుస్తాడనుకుంటున్నాడు గనక, అతను శాంతికి ఒప్పుకోడు. అతనికి సైనిక బలం కూడా చాలా హెచ్చుగా ఉన్నది. అందుచేత నువ్వు ఏమి చెప్పినా అతని తలకు ఎక్కదు. అతనికి అండగా వచ్చిన రాజులలో నీకు శత్రువులు చాలామంది ఉన్నారు. వాళ్ళమధ్యకు నువ్వు వెళ్ళటం నాకెంత మాత్రమూ ఇష్టం లేదు. నీ మీది అభిమానంతో చెప్పాను గాని, నీ ప్రభావమూ, పౌరుషమూ తెలీక కాదు," అన్నాడు.

దానికి కృష్ణుడు విదురుడితో, "స్నేహితుడు చెప్పదగిన మాట చెప్పావు. నువ్వన్నట్టు జరుగుతుందని తెలిసే నేను వచ్చాను. అయినా శాంతి కోసం శాయ శక్తులా ప్రయత్నించి, ఉభయపక్షాలకూ నాశనం కలగకుండా చూడటం నా ధర్మం. లేకపోతే సర్వనాశనం జరుగుతూ ఉంటే కృష్ణుడు చూస్తూ ఊరుకున్నాడన్న మాట వస్తుంది. నాకు వచ్చిన భయం ఏమీ

లేదు," అని చెప్పి, ఆ రాత్రి విదురుడి ఇంటనే నిద్రచేశాడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసి, సంధ్యావందనం చేస్తూ ఉండగా దుర్యోధనుడూ, శకునీ వచ్చి, ధృతరాష్ట్రుడు సభలో ఉన్నాడనీ, కృష్ణుడి రాకకోసం ఎదురుచూస్తున్నాడనీ తెలిపారు.

ఇంతలో కృష్ణుడి సారథి అయిన దారుకుడు రథం సిద్ధంగా ఉన్నదని చెప్పాడు. కృష్ణుడు తన రథంలో విదురుణ్ణి ఎక్కించుకుని బయలుదేరాడు. దుర్యోధన, శకునులు తమ రథంలో బయలుదేరారు. వారి వెంట ఇంకా అనేక మంది రాజులు ఏనుగుల మీదా, గుర్రాల మీదా వచ్చారు. ఇలా పెద్ద బలగంతో రాజవీధి వెంబడి ధృతరాష్ట్రుడి సభకు వెళ్ళే కృష్ణుణ్ణి వీధుల వెంబడి నిలబడి స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ చూశారు.

సభద్వారం దగ్గర కృష్ణుడు తన రథం దిగి, ఒక చేత్తో విదురుణ్ణీ, మరొక చేత్తో సాత్యకినీ పట్టుకుని సభలోకి ప్రవేశించాడు. కృష్ణుడికి ముందుగా కర్ణ దుర్యోధనులూ, అతని వెనకగా కృతవర్మ మొదలైన వృష్ణివీరులూ సభా ప్రవేశం చేశారు. సభలోని వారంతా కృష్ణుడికి తగిన గౌరవ మర్యాదలు చూపారు. అతను తన కోసం సిద్ధంగా ఉంచిన ఆసనం మీద కూర్చున్నాడు. అతనికి దగ్గరలోనే కర్ణుడూ, దుర్యోధనుడూ ఒకే ఆసనం మీద కూర్చున్నారు. విదురుడు కృష్ణుడి పక్కనే మరొక ఆసనం మీద కూర్చున్నాడు.



నిశ్శబ్దంగా ఉన్న సభలో కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు:

"రాజా, వీరులందరూ నాశనం కాకుండా కౌరవ పాండవుల మధ్య శాంతి సాధించమని నిన్ను యాచించటానికి నేను ఇక్కడికి వచ్చాను. మేలు చేకూరే మార్గాలు నీకు ఒకరు చెప్పనవసరం లేదు. అన్ని రాజవంశాలకూ అగ్రస్థానంలో కురుకులం ఉన్నది. కౌరవులకు నువ్వు ముఖ్యుడివి. ఎవరు ఏ తప్పుచేసినా నువ్వు శిక్షించగలవు. దుర్యోధనుడు మొదలైన నీ కొడుకులు ధర్మమూ, అర్థమూ విడిచిపెట్టి, మర్యాదలన్నీ మంటగలిపి అనేక దుష్కార్యాలు చేస్తున్నారు. ఇది నువ్వు తెలుసుకోవాలి. రానున్న ఆపదకు కౌరవులే కారణభూతులు. ఈ ఆపదను నివారించకపోతే భూమి మీదగల ప్రజలందరికీ నాశనం గలుగు



తుంది. ఈ ఆపదను తప్పించే శక్తి నీలో ఉన్నది. కౌరవ పాండవుల మధ్య శాంతి కలిగించటం కష్టం కాదని నా నమ్మకం. అది నీ చేతిలోనూ, నా చేతిలోనూ ఉన్నట్టిదే. నువ్వు నీ కొడుకులను సన్మార్గానికి తిప్పు, నేను పాండవుల కోపాగ్ని చల్లార్చుతాను. నీ కొడుకులనూ, నీ కులంవారినీ శాసించే హక్కు నీకున్నది. వారిని శాసించి, వారికీ, పాండవులకూ సంధిచెయ్యి. పాండవులను జయించటం ఎవరితరమూ కాదు. వారు నీకు అండగా వుండగా నిన్ను జయించటం ఎవరి తరమూ కాదు. నువ్వు ప్రపంచాన్ని అంతనూ శాసించగలుగుతావు. పాండవులతో సంధి నీకే లాభకరం. యుద్ధంలో నీ కొడుకులు ఓడినా, పాండవులు ఓడినా నీకు ఏం సుఖం ఉంటుంది? యుద్ధం జరిగితే ప్రపంచంలో గల రాజులందరూ అందులో పాల్గొని అందరూ చచ్చిపోతారు. అందు చేత ఈ ప్రపంచాన్ని కాపాడటం నీ చేతిలో ఉన్నది. ఇక్కడ చేరిన రాజులందరూ సంతోషంగా సహపంక్తి భోజనాలు చేసి, ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయేటట్టు చూడు. పాండవులకు నీ కన్న పెద్ద దిక్కెవరు? కష్ట సమయంలో నువ్వు ఆదుకోకపోతే వారికి ఎవరున్నారు? ఆ మాటే వారు నీతో చెప్పమన్నారు. ఈ సభలో ఉన్నవారితో వారు మరొకమాట చెప్పమన్నారు: ఏ సభలో అధర్మ నిర్ణయం జరుగుతుందో ఆ అధర్మం వల్ల కలిగిన పాపం సభలోని వారికందరికీ చుట్టు కుంటుంది. అందుచేత సభికులు ధర్మాన్నీ, న్యాయాన్నీ చెప్పటం వారి విధి. నేను బాగా ఆలోచించి చెబుతున్నాను. ఈ రాజు లందరినీ మృత్యువు నుంచి కాపాడు. పాండవులకు న్యాయంగా వారి తండ్రి భాగం ఇయ్యి. ధర్మరాజు ఎలాటి వాడో నీకు తెలుసు. లక్క ఇల్లు కాల్చినా అతను తిరిగి నీ వద్దకే వచ్చాడు. నువ్వు అతన్ని ఇంద్రప్రస్థానికి తోలితే మారు మాటాడక వెళ్ళాడు. శకుని మాయతో నీ కొడుకు తన సర్వస్వమూ కాజేసినా ధర్మరాజు సహించాడు. నేను మీ క్షేమమూ, పాండవుల క్షేమమూ కోరి చెబుతున్నాను. నీ కొడుకులను నిగ్రహించు. పాండవులు నీకు సేవచెయ్యటానికైనా, యుద్ధం చెయ్యటానికైనా సిద్ధంగానే వున్నారు. కనక నువ్వు బాగా ఆలోచించి, నీకు ఏది మంచిదనితోస్తే అది చెయ్యి."

కృష్ణుడు మాట్లాడటం పూర్తి చేసిన తరవాత అందరూ మౌనంగా ఉండి పోయారు. అప్పుడు పరశురాముడు ధృత రాష్ట్రుడితో, "రాజా ఒక నీతితో కూడిన సంగతి చెబుతాను. అది నీకు నచ్చి నట్టయితే దాని ప్రకారం నడుచుకో," అంటూ ఇలా చెప్పాడు:

పూర్వం దంబోద్భవుడనే రాజు ఉండే వాడు. అతను ప్రతి ఉదయమూ నాలుగు వర్ణాల వారినీ పిలిపించి, "మీలో ఎవరైనా నన్ను జయించగలరా?" అని అడిగేవాడు. అలాంటి ఆత్మశ్లాఘం కూడదని బ్రాహ్మ ణులు సలహా ఇచ్చినప్పటికీ ఆ రాజు తన అలవాటు మానలేదు.

చివరకు బ్రాహ్మణులు ఆ రాజుతో విసిగిపోయి, "రాజా, నరనారాయణులని ఇద్దరు ఋషులున్నారు. వారిద్దరే ఎంత మందినైనా జయించగలరు. వారు గంధ మాదనపర్వతం మీద తపస్సుచేసుకుంటూ ఉంటారు. యుద్ధం చెయ్యాలని ఉత్సాహం ఉంటే వారి వద్దకు వెళ్ళు," అన్నారు.

దంబోద్భవుడు తన సేనలను వెంట బెట్టుకుని నరనారాయణులు తపస్సు చేసుకునే చోటికి వెళ్ళి, వారు ఆతిథ్యం ఇవ్వబోతే తనకు యుద్ధంతో ఆతిథ్యం కావాలన్నాడు. అది యుద్ధాలు చేసే ప్రదేశం కాదని వారు చెప్పినా అతను వినిపించుకోలేదు. అప్పుడు నరుడనే ఋషి అలిగి, ఇన్ని దర్భలు మంత్రించి వేశాడు. ఆ దర్భాస్త్రానికి దంబోద్భవుడూ, అతని సేనలూ దిగ్భ్రమచెందిపోయాయి. దంబోద్భవుడు నరుడి కాళ్ళపై బడి క్షమా పణ చెప్పుకున్నాడు.

"నువ్వు నీ ప్రగల్భాలు మాని ప్రజారంజ కంగా రాజ్యం పాలించుకో," అని చెప్పి నర నారాయణులు దంబోద్భవుణ్ణి పంపేశారు.

పరశురాముడు ఈ కథ చెప్పి, "ధృతరాష్ట్రా, నరుడు మాత్రమే ఇంత పని చెయ్యగలిగాడు. నారాయణుడు నరుడి కన్న కూడా అధికుడు. ఆ నరనారాయణులే అర్జునుడూ, కృష్ణుడూనూ. అందుచేత అర్జునుడు గాండీవం ఎక్కు పెట్టక ముందే దురభిమానం అవతల పెట్టి అతన్ని శరణువేడుకో. కృష్ణుడు తోడైన అర్జునుణ్ణి యుద్ధరంగంలో సహించటం అసాధ్యం. యుద్ధం మాట కట్టిపెట్టి పాండవులతో సంధిచేసుకో," అన్నాడు.



# దివ్య సౌందర్యం

మహారాణి అంతఃపురంలో శయనగృహాన్ని ఊడుస్తూన్న మంగమ్మకు నేల మీద కొన్ని ముత్యాలు, మణులు కనిపించాయి. అవి రాణీగారి కంఠహారం నుంచీ, అందెలనుంచీ రాలిపడినవి. మంగమ్మ వాటిని మహారాణికి అప్పగించింది. మంగమ్మ నిజాయితీకి సంతోషించిన మహారాణి ముత్యాలనూ, మణులనూ ఆమెకే ఇచ్చివేసింది. మంగమ్మ వాటిని ఇంటికి తీసుకువెళ్ళి చిన్న పెట్టెలో భద్రంగా దాచింది.

మంగమ్మ కొడుకు పదేళ్ళవాడు దూరగ్రామంలో గురుకులంలో చదువుకుంటున్నాడు. వాడు ఒకనాడు తల్లిని చూడడానికి వచ్చాడు. ఆ రోజు రాత్రి, పెట్టెలో తల్లి దాచిన ముత్యాలను చూసి పట్టరాని సంతోషంతో, "ఆహా! ముత్యాలు తళ తళా మెరుస్తూ ఎంత అందంగా ఉన్నాయో చూడు!" అన్నాడు వాడు తల్లితో.

"అవును, అవి అందమైనవే నాయనా! అయినా, ఇటువంటి ముత్యాలు, మణులు, మాణిక్యాలు పొదిగిన మరిన్ని విలువైన నగలను ధరించిన మహారాణిగారి అందం చూశావంటేనే నువ్వు అసలు అందం అంటే ఏమిటో తెలుసుకోగలవు!" అన్నది తల్లి.

కుర్రవాడు ఆ మాటకు ఏమీ బదులు చెప్పకుండా మౌనంగా ఏదో ఆలోచిస్తూ వుండి పోయాడు. తెల్లవారాక వాడి జాడ కనిపించలేదు. తల్లిదండ్రులు ఆతృతతో ఇరుగు పొరుగుతో కలిసి చుట్టుపక్కల వెతికారు. ఆఖరికి గురుకులానికి కూడా వెళ్ళిచూశారు. అయినా ప్రయోజనం లేక పోయింది!

కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. కనిపించని కొడుకును గురించి ఇంకా దిగులు పడుతూన్న తల్లిచేతికి ఒకనాడు ఎవరో ఒక లేఖ తెచ్చి ఇచ్చారు. అది ఆమె కొడుకు పంపింది: "అమ్మా, నీకు చెప్పకుండా ఇల్లువదిలి పెట్టినందుకు క్షమించు. ఆకాశంలోని సూర్యచంద్రులూ, నక్షత్రాలూ దేవుడి ఆభరణాలని మా గురువు తరచూ చెబుతూ ఉండేవారు. ముత్యాలు, మణులు పొదిగిన నగలు అందమైనవేగాని, వాటిని ధరించే మహారాణి మరింత అందమైనవారు అని నీ నోటిగుండా విన్నప్పుడు, మా గురువుగారి మాటలే గుర్తుకు వచ్చాయి. సూర్యచంద్రులూ, నక్షత్రాలూ అందమైనవే; అయితే వాటిని నిత్యనూతన ఆభరణాలుగా ధరించిన దివ్యశక్తి సౌందర్యం అద్భుతం కదా! ఆ దివ్యశక్తిని వెతుకుతూ బయలుదేరాను. ఇప్పుడు దానిని కనుగొన్నాను. ఆ దివ్య సౌందర్యం మాటలకు అందనిది!"

మానవులుగా జన్మించినవారిలో ఏ కోటికొక్కరు మాత్రమే సాధించగలిగిన మహాభాగ్యాన్ని తన బిడ్డ సాధించినందుకు ఆ తల్లి కళ్ళనుంచి ఆనంద బాష్పాలు రాలాయి!



# తండ్రికోసం



ఒకప్పుడు గాంధార దేశాన్ని ధన్వంతుడనే రాజు పాలించేవాడు. ఒకనాడాయన సపరివారంగా అరణ్యానికి వేటాడబోయి, అక్కడ ఒక పుష్ప వృక్షం కింద నిలబడి వున్న ఒక అతిలోక సుందరిని చూశాడు. ధన్వంతుడు ఒంటరిగా ఆ స్త్రీని సమీపించి, "ఎవరునీవు? ఈ అరణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు?" అని అడిగాడు.

"నేనొక గంధర్వ స్త్రీని. ఆకాశమార్గాన వెళుతూ, ఈ చెట్టు పూల వాసన ఆకర్షించగా, కిందికి దిగి వచ్చి చెట్టు కింద నిలబడ్డాను," అని ఆమె జవాబు చెప్పింది.

"నీవు మీ లోకానికి తిరిగి పోవద్దు. నా వెంట వచ్చి నన్ను పెళ్ళాడి మా అంతఃపురంలో ఉండిపోయి, నాకు ఆనందం కలిగించు," అన్నాడు రాజు.

గంధర్వస్త్రీ అందుకు ఒప్పుకోలేదు. రాజు మరింత ప్రాధేయపడసాగాడు. చివరికామె చిరాకుపడి, "నీ కళ్ళు, నీ బుద్ధిని పాడుచేశాయి. గంధర్వస్త్రీనని చెప్పినా అర్థం చేసుకోలేకుండా ఉన్నావు గనక, గుడ్డివాడివైపో!" అని శపించి, ఆకాశంలోకి ఎగిరిపోయింది.

గుడ్డివాడైపోయిన ధన్వంతుణ్ణి ఆయన పరివారం ఇల్లు చేర్చారు. ఆయన అంధత్వానికి ఎన్ని చికిత్సలు చేసినా ప్రయోజనం లేకపోయింది. శాపంవల్ల వచ్చిన గుడ్డితనం శాపవిమోచనంతోగాని పోదు. ఎవరైనా ఆ గంధర్వ స్త్రీ వద్దకు వెళ్ళి, ఆమె అనుగ్రహం సంపాదించి రాజును అంధత్వం నుంచి విముక్తిణ్ణి చేయాలి. కాని ఈ పని ఎవరివల్ల సాధ్యమవుతుంది?

ధన్వంతుడికి ఒకే ఒక కొడుకున్నాడు. అతని పేరు నిరంజనుడు. "నేను ఎంత శ్రమ అయినా పడి గంధర్వలోకానికి వెళ్ళి, తండ్రిని శపించిన గంధర్వ స్త్రీ ఎవరో తెలుసుకుని, ఎలాగైనా ఆమెను సుముఖురాలిని చేసుకుని, తండ్రి అంధత్వం పోగొట్టే ఉపాయం తెలుసుకుని, తిరిగి వస్తాను," అని నిరంజనుడు బయలుదేరాడు.



గంధర్వలోకం ఈశాన్య దిశగా ఉన్నదని అందరూ అనేవారు. అందుచేత అదే దిక్కుగా చాలాకాలం ప్రయాణించి, ఎటూ దారిలేని ప్రాంతానికి చేరాడు. ఎక్కడా మనుషులు లేరు. తినటానికేమీ లేదు. ఆకలితో శోషిల్లి నిరంజనుడు ఒక చెట్టుకింద పడుకున్నాడు.

తిరిగి స్పృహ తెలిసేసరికి ఒక వికారాకారం గల స్త్రీ అతని పక్కన కూర్చుని అతని చేత పళ్ళు ఏవో తినిపిస్తున్నది.

"నేనొక పిశాచిని. ఈ చెట్టుపైన ఉంటాను. ఈ రోజు నీవు నా అతిథిగా వచ్చావు. అందుచేత నాకు చేతనైనట్టుగా అతిథిసత్కారం చేస్తున్నాను. ఎవరూ ఇటుగా రారు. నీవెందుకు వచ్చావు?" అని ఆ స్త్రీ నిరంజనుణ్ణి అడిగింది. నిరంజనుడు తక కథ అంతా పిశాచికి చెప్పి, "ఆకలితో పడిపోయిన నాకు తిండి పెట్టి కాపాడావు. గంధర్వలోకానికి దారి కూడా చెప్పావంటే అదిచాలు," అన్నాడు.

"ఇక్కడి నుంచి గంధర్వలోకానికి వెళ్ళే దారి ఆకాశమార్గమే. నీకది సాధ్యంకాదే!" అన్నది పిశాచి.

"ఎంత అసాధ్యమైనా వెళ్ళి తీరాల్సిందే గాని, వెనక్కు తిరిగి పోవటానికి లేదు," అన్నాడు నిరంజనుడు.

"నేను నిన్ను గంధర్వలోక ద్వారం దాకా తీసుకుపోగలను. లోపల ప్రవేశించటం నాకు సాధ్యంకాదు," అన్నది పిశాచి.

"ఆ పని చేస్తివా, నేను నీకు బతికినంత కాలం ఎంతైనా ఋణపడి ఉంటాను," అన్నాడు నిరంజనుడు. "నా కోరిక ఒక్కటి తీర్చేస్తే ఆ ఋణం యావత్తూ తీరిపోతుంది. ఏమంటావు?" అన్నది పిశాచి.

"నాకు సాధ్యమైనదైతే నీ కోరిక తప్పక తీరుస్తాను," అన్నాడు నిరంజనుడు

"నీకు సాధ్యంకానిదైతే నేను కోరుతానా?" అంటూ పిశాచి నిరంజనుణ్ణి కళ్ళు మూసుకోమన్నది.

అతను తిరిగి కళ్ళు తెరిచేసరికి గంధర్వలోక ద్వారం వద్ద ఉన్నాడు. పిశాచి ఒక మబ్బు తిన్నెపైన కూర్చుని, "నీవు తిరిగి వచ్చేదాకా ఇక్కడే వుంటాను. నీ పని పూర్తిచేసుకుని రా. తరవాత నిన్ను మీ దేశం చేర్చుతాను," అన్నది.

అతను గంధర్వలోకంలోకి అడుగు పెట్టగానే అనేక మంది గంధర్వకాంతలతన్ని చుట్టుముట్టి, "ఎంత అందంగా ఉన్నాడో!" అనుకున్నారు. కొందరతన్ని,

"నీకేం కావాలి? ఎవరు కావాలి?" అని అడిగారు.

"నాకొక గంధర్వస్త్రీతో పని ఉన్నది. ఆమె ఇటీవల భూలోకానికి వచ్చి, మా తండ్రిగారిని గుడ్డివాడివి కమ్మని శపించింది. ఆమె పేరు నాకు తెలియదు," అన్నాడు నిరంజనుడు.

గంధర్వ కాంతలు తమలో తాము మాట్లాడుకుని, నిరంజనుడి తండ్రిని శపించినది గంధర్వరాజ కుమార్తె పుష్పోత్తమ అయి వుంటుందని నిశ్చయించి, అతన్ని ఆమె వద్దకు తీసుకుపోయారు.

"నీ వా రాజు కొడుకువా? అతన్ని నేనే శపించాను. నన్ను తన అంతఃపురంలో ఉండమని అవమానించాడు," అన్నది పుష్పోత్తమ.



"అమ్మా, మీరు మా తండ్రిగారిని సరిగా అర్థం చేసుకోలేదు. ఆయన మీ మీది గౌరవంతోనే అలా కోరారు; మిమ్మవమానించటానికి కాదు. దయ ఉంచి మీ శాపాన్ని ఉపసంహరించి ఆయనకు దృష్టి ప్రసాదించండి," అన్నాడు నిరంజనుడు.

పుష్పోత్తమ అతని కొక పువ్విస్తూ, "ఈ పుష్పాన్ని నీ తండ్రి కళ్ళకు తగిలిస్తే అంధత్వం పోతుంది. కాని ఈ పుష్పాన్ని నీ తండ్రి కంటికి తాకించే వాడు ఆడి తప్పనివాడుగా ఉండాలి. ఆడి తప్పిన పక్షంలో మీ తండ్రి తిరిగి గుడ్డివాడై పోతాడు," అన్నది.

నిరంజనుడా పుష్పాన్ని తీసుకుని, పుష్పోత్తమ వద్ద సెలవు పుచ్చుకుని, గంధర్వలోకం ద్వారం దాటి, పిశాచి ఉన్న చోటికి తిరిగి వచ్చాడు. ఆమె ఒక్క క్షణంలో అతన్ని గాంధార దేశంలో రాజభవనం వద్ద చేర్చి, "రాజకుమారా, నీకు నావల్ల కావలసిన సహాయం అయిపోయింది. నా కోరిక తీరుస్తానన్నావు. నన్ను పెళ్ళాడు— అదే నాకోరిక," అన్నది.

నిరంజనుడు "సరే, నేను త్వరలోనే తిరిగివస్తాను. ఇక్కడే ఉండు," అని రాజభవనంలోకి వెళ్ళి, గంధర్వస్త్రీ ఇచ్చిన పుష్పాన్ని తన తండ్రి కళ్ళకు తాకించాడు. వెంటనే రాజుకు యథాప్రకారం దృష్టి వచ్చేసింది.

తరవాత నిరంజనుడు తన తండ్రికీ, మంత్రులకూ పిశాచి సంగతి వివరంగా చెప్పి, ఆమెను వెంటనే వివాహ మాడతానన్నాడు.

"వద్దు, నీవాపిశాచిని పెళ్ళాడకు," అన్నాడు రాజు.

"అన్నమాట తప్పితే మీకు తిరిగి అంధత్వం వచ్చేస్తుంది. నేను పడిన శ్రమ అంతా వృధా అయిపోతుంది," అన్నాడు నిరంజనుడు.

"నీవు పిశాచిని పెళ్ళాడే కన్న నేను మునుపటిలా గుడ్డివాణ్ణిగా ఉండటమే నయం," అన్నాడు రాజు.

"కాని, ఆడిన మాట తప్పటం కంటె పిశాచిని పెళ్ళాడటమే నయం!" అన్నాడు నిరంజనుడు.

అతను పిశాచి వద్దకు తిరిగి వచ్చి, "నేను నిన్ను పెళ్ళాడి నీ కోరిక తీరుస్తాను. కానీ, నీవు మాత్రం ఎవరికీ కనబడకుండా ఒక ఇంట దాగి ఉండాలి. నిన్ను చూస్తే అందరూ దడుచుకుంటారు!" అన్నాడు.

"నన్ను పాణిగ్రహణం చేసుకున్న తరవాత నీవెలా ఉండమంటే అలా ఉంటాను," అన్నది పిశాచి. నిరంజనుడు లాంఛనప్రాయంగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు. మరుక్షణమే పిశాచి మాయమై ఒక అందమైన రాజకన్య అక్కడ నిలబడింది. "ఏమిటీ వింత!" అని నిరంజనుడడిగాడు.

"నేను వత్సదేశపు రాజకుమార్తెను. నా పేరు సౌరభ. ఒకసారి ఒక ముసలి యోగి మా ఇంటికి వచ్చాడు. మా తండ్రి నన్నాయన శుశ్రూషకు నియోగించాడు. ఆయోగికి నన్ను పెళ్ళాడాలని కోరిక కలిగి నా తండ్రితో చెప్పాడు. మా తండ్రి యోగికి భయపడి సరే నన్నాడు, కాని నేను మాత్రం ఆ ముసలివాణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకోలేదు. యోగి అలిగి నన్ను వికారాకారం గల పిశాచం కమ్మని శపించాడు. నా తండ్రి కాళ్ళు పట్టుకుని బతిమాలిన మీదట, నన్నెవడైనా ఆ వికారరూపంలో పెళ్ళాడటానికి సమ్మతించి పాణిగ్రహణం చేస్తే శాపవిముక్తి కలిగేటట్టు అనుగ్రహించాడు. ఇంతకాలానికి నీ మూలంగా నాకు శాపవిమోచనం జరిగింది," అన్నదామె.

నిరంజనుడి భార్య పిశాచం కానందుకు అందరూ ఎంతో సంతోషించారు. వారి పెళ్ళి ఎంతో వైభవంగా జరిగింది.







# భారతదేశం



మహాభారత ఇంద్రప్రస్థం–ఒక చిత్రకారుడి ఊహాచిత్రం

## ఢిల్లీనగరం

ఈనాడు ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ప్రజాస్వామ్యమైన మనదేశ రాజధాని ఢిల్లీ నగరం వున్న ప్రదేశంలోనే–పాండవులకోసం విశ్వకర్మ ప్రప్రథమంగా ఇంద్రప్రస్థమనే అద్భుత నగరాన్ని నిర్మించాడు. అందులోనే మయాసురుడు అద్భుత మాయాజాల నిలయమైన మయసభను సృష్టించాడని మహాభారతం చెబుతుంది.

ఇంద్రప్రస్థం పురాణకాలం నాటిది. ప్రస్తుతం దాని జాడలేవీ కనిపించడంలేదు. బహుశా యమునానది ప్రవాహమార్గం పలుమార్లు మారడంతో పురాతన నగరం కొట్టుకుపోయి వుండవచ్చు. అదే ప్రాంతంలో ఐదుసార్లు మళ్ళీ మళ్ళీ నగరం నిర్మితమయిందనీ, అలా ఏడవసారిగా నిర్మించ బడినదే ఇప్పుడున్న ఆధునిక నగరం అనీ చెబుతారు. అందుకేనేమో దీనిని హిందీలో ఢిలీ (బోలు) అన్నారు. నగరం అడుగున భూగర్భంలో సర్పరాజు వాసుకి పడగల తల ఉందనీ, వాసుకి తల కొద్దిగా కదిలించినప్పుడు భూకంపం ఏర్పడి భవనాలు పేకమేడల్లా కూలిపోయేవనీ పూర్వకాలంలో చెప్పుకునేవారు!

ఇది కల్పితకథే గాని, ఒక్కటి మాత్రం నిజం. దాడులకూ, యుద్ధాలకూ గురికావడం వల్ల, ఢిల్లీ తరచూ నాశనం కావడం; మళ్ళీ నిర్మించడం జరుగుతూ వచ్చింది.

ఇక చారిత్రకంగా చూశామంటే, ఎనిమిదవ శతాబ్దంలో అనంగపాలుడనే రాజపుత్ర రాజు ఈ ప్రాంతంలో మొట్ట మొదట నగరాన్ని నిర్మించాడు. ఆయన నిర్మించిన కోట పేరు లాల్‌కోట్. ఆ తరవాత చౌహాన్ రాజులు ఢిల్లీ నుంచి పరిపాలన సాగించారు. మహావీరుడూ, పరాక్రమశాలీ అయిన పృథ్వీరాజ్ వారిలో సుప్రసిద్ధుడు. ఆయన, కనూజ్‌రాజు జయచంద్రుడి కుమార్తె యువరాణి సంయుక్త ఒకరినొకరు ప్రేమించుకున్నారు. జయచంద్రుడు దానిని వ్యతిరేకించాడు. ఆయన కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. స్వయంవరానికి పృధ్వీరాజుకు

ఆహ్వానం పంపక పోగా; ఆయన్ను అవ మానించాలని స్వయంవర మంటపంలో ద్వారపాలకుడి స్థానంలో పృథ్వీరాజ్ విగ్రహాన్ని ఉంచాడు. యువరాణి సంయుక్త ఆ విగ్రహం మెడలో వరమాల వేసింది. అక్కడే రాజుల మధ్య వున్న పృథ్వీరాజ్ మెరుపులా ముందుకు ఉరికి, ఆమెను గుర్రంమీద తీసుకుని వెళ్ళి వివాహ మాడాడు. ఇది 1175వ సం॥లో జరిగింది.

టర్క్ జాతీయుడైన ఘోరీపాలకుడు మహమ్మద్ ఘోరీ 1192వ సం॥లో ఢిల్లీపై దండెత్తి వచ్చాడు. పృథ్వీరాజ అతన్ని ఓడించాడు. కాని దయతలచి ప్రాణాలతో తిరిగి వెళ్ళడానికి అనుమతించాడు. అయితే, మరుసంవత్సరమే జయచంద్రుడి సహాయంతో మహమ్మద్ ఘోరీ మళ్ళీ దండెత్తి వచ్చి పృథ్వీరాజును ఓడించి, హతమార్చాడు! ఒక్క సంవత్సరం తిరిగే సరికి, పృథ్వీరాజును ఓడించడానికి తనతో చేతులు కలిపిన జయచంద్రుణ్ణి సైతం హతంచేసి అతని రాజ్యాన్ని ఆక్రమించాడు మహమ్మద్‌ఘోరీ! ఆ తరవాత కొన్నాళ్ళకే ఘోరీ, తిరుగు బాటుదారుల కత్తిపోటుకు గురై ప్రాణాలు విడిచాడు!

మొగలులే ఢిల్లీని పాలించిన సుప్రసిద్ధ వంశస్థులు. 1911వ సం॥లో బ్రిటిష్ పాలకులు తమ రాజధానిని ఢిల్లీకి మార్చు కున్నారు. 1947వ సం॥లో ఢిల్లీ నుంచి భారత స్వాతంత్ర్యం ప్రకటించబడింది.

చూపరులను ఆకర్షించి, అలరించే చారిత్రక భవనాలూ, చిహ్నాలూ ఢిల్లీలో చాలా ఉన్నాయి.

తొంభై అయిదు లక్షల జనాభా కలిగిన ఆధునిక ఢిల్లీ నగర వైశాల్యం 1,483 చ.కి.మీ. హిందీ, పంజాబీ, ఉర్దూ ఇంగ్లీషు భాషలు మాట్లాడేవారు ఎక్కువగా ఉన్నారు. దేశ రాజధాని ప్రాంతంగా నగరానికి ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నది. డెబ్బైమంది సభ్యులు గల శాసన సభ; మంత్రిమండలి కలిగి ఉన్నది.

ఢిల్లీ మనదేశానికి కేవలం రాజకీయ రాజధాని మాత్రమే కాదు; నగరంలోనూ చుట్టుపక్కలా వివిధ పరిశ్రమలతో ఉత్తర భారత వాణిజ్య కేంద్రంగానూ వెలుగొందు తున్నది. విద్యావ్యాప్తికి కృషి చేస్తూన్న విశ్వ విద్యాలయాలూ, కళాశాలలూ, పాతవీ, కొత్తవీ చాలా ఉన్నాయి. రాజకీయ, సాంస్కృతిక కార్యకలాపాలతో అనునిత్యం నవజీవంతో తొణికిసలాడుతూన్న మహా నగరం కొత్తఢిల్లీ!



ఎనిమిదవ శతాబ్దంలో అనంగపాలుడనే రాజపుత్ర రాజు నిర్మించిన లాల్‌కోట

# అప్పులవాళ్ళ బాధ

ఒకానొక గ్రామంలో నరసింహం అనే గ్రామాధికారి, గ్రామ మధ్యంలో వున్న రావిచెట్టు అరుగు మీద తీరిగ్గా కూర్చుని, గ్రామస్తులతో పిచ్చాపాటీ మాట్లాడుతూండగా గరుడయ్య అనే వడ్డీ వ్యాపారి, ఆయనదగ్గిరకు వచ్చి, "అయ్యా, నేను సర్వనాశనం అయిపోకుండా, తమరే న్యాయం చెయ్యాలి!" అన్నాడు చేతులు జోడిస్తూ.

దానికి న్యాయాధికారి, అతడికేసి చిరాగ్గా చూస్తూ, "నేను ఈ చుట్టుపక్కల రెండు, రెండు నాలుగు గ్రామాలకు న్యాయాధికారిని, నరసింహం అనే పేరు న్యాయానికి మరోపేరని, అందరూ చెప్పుకుంటారని విన్నాను. ఒకవేళ, నువ్వు నా న్యాయబుద్ధిని శంకించడం లేదు గదా?" అన్నాడు.

ఇది విని వడ్డీవ్యాపారి బిక్కమొహంతో, "అయ్యా, ఎంతమాట! తమరి న్యాయబుద్ధిని శంకించడమా," అని పక్కగ్రామంలో శంకరయ్య అనేవాడు, తన దగ్గర ఏడువందలు అప్పుగా తీసుకుని, రెండేళ్ళుగా వడ్డీ యివ్వకపోగా, అసలుకే ఎసరు పెట్టేలావున్నాడని చెప్పాడు.

వెంటనే నరసింహం, గ్రామ నౌకరును పిలిచి, ఆ శంకరయ్యను చేతులు కట్టి మరీ తన దగ్గరకు లాక్కురమ్మని చెప్పాడు.

గ్రామనౌకరు పోయి, తేలిగ్గా శంకరయ్యను పట్టుకుని, గ్రామంకేసి తీసుకురాసాగాడు.

అది మండు వేసవికాలం కాలిబాట పక్కన ఒక చింతచెట్టు కనబడగానే గ్రామనౌకరు, శంకరయ్యతో, "ఎండ భరించడం కష్టంగా వున్నది. ఆ చింతచెట్టుకింద కాసేపు కూర్చుని వెళదాం," అన్నాడు.

ఇది వింటూనే శంకరయ్య గాభరా పడిపోతూ, "ఎండ అని యిక్కడ ఆగితే చిక్కుల్లో పడిపోతాను. చూశావా, ఈ చుట్టూ కనబడే నాలుగైదూళ్ళలో, వడ్డీ వ్యాపారుల దగ్గర అప్పులు చేశాను. వాళ్ళల్లో ఎవరైనా వచ్చి నన్ను వాళ్ళగ్రామంకేసి లాక్కుపోగలరు. నన్ను తొందరగా మీ గ్రామంకేసి తీసుకుపో," అన్నాడు.



# కనుగొనండి, రాయండి,

ఈ సంచికలో ప్రచురించిన ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రకటించబడతాయి. అదేసమయంలో మీరు కూడా భారతదర్శనం పోటీకి సమాధానాలు పంపవచ్చు. అయితే, ఎంట్రీలు పంపడానికి మీరు కొంత సృజనాత్మక కృషి చేయాలి. గత సంచికలోని కథలను క్షుణ్ణంగా చదవండి. ఆ కథలలో మీకు బాగా నచ్చిన కథను తెలియజేస్తూ ఆ కథ ఎందుకు మీకు నచ్చింది? అన్న దానిని వివరిస్తూ ఇరవై వాక్యాలకు మించకుండా చిన్న వ్యాసం రాసి మీ సమాధానాలకు జతచేయాలి. మీ వయస్సు, విద్యార్థి(ని) అయినట్టయితే మీరు చదువుతూన్న తరగతి/విద్యాసంస్థ పేరు; మీ పూర్తి చిరునామా రాసి, సమాధానాల చివర మీరు సంతకం చేయాలి. మీ సంతకాన్ని ధృవపరుస్తూ, మీ ఉపాధ్యాయులు లేదా మీ తల్లితండ్రులలో ఎవరో ఒకరు, సంతకం చేయాలి. సమాధానాలను **భారతదర్శనం పాఠకులకు పోటీ**, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-**600 026** చిరునామాకు పంపాలి.

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి | రూ. **1000**/- | ఇంకా ఐదు ప్రోత్సాహక బహుమతులు ఒక్కొక్కటి రూ. **200**/- |
| రెండవ బహుమతి | రూ. **500**/- | |






## 1 భారతదర్శనం పాఠకులకు పోటీ

రాజ్యంపై దండెత్తివచ్చిన శత్రువు, రాజును అపహరించుకుని వెళ్ళాడు. అలాచేసిన శత్రువును రాణి వివాహమాడినట్టయితేనే రాజును విడుదల చేయగలమని రాణికి సందేశం అందింది. ఆమె సరేనని మేనాల్లో వందలాది మంది చెలికత్తెలు వెంటరాగా శత్రువులు బసచేసి వున్నచోటికి బయలుదేరింది. శత్రుశిబిరాన్ని చేరగానే మేనాలనుంచి బయట అడుగుపెట్టిన వారు చెలికత్తెలు కారు; మెరికల్లాంటి సైనికులు. వాళ్ళు శత్రుసేనలను చీల్చి చెండాడారు. రాణి రాజును విడిపించింది. ఇద్దరూ అక్కడి నుంచి తప్పించుకుని తమ కోటను చేరుకున్నారు. ఈ చారిత్రక సంఘటనలోని రాణి, రాజు ఎవరు? ఇది ఎప్పుడు జరిగింది?

మన పురాణాలలోని ఈ జం
పాత్రల మధ్యవున్న సంబం
ఏమిటో తెలుసా?



విజ్ఞాన వినోదాల మేలు కలయిక

# బహుమతులు గెలుచుకోండి!

మామ

దర్శనం

కు పోటీ



1. ప్రపంచంలోకెల్లా మొట్టమొదటి కల్పిత కథల సంకలనంగా పేరుగాంచిన భారతీయ గ్రంథం ఏది? గ్రంథకర్త ఎవరు?
2. ప్రపంచంలోనే మొట్టమొదటి కథా సంకలనంగా చెప్పబడే భారతీయ గ్రంథం ఏది? రచయిత ఎవరు?
3. ప్రపంచంలో మొట్టమొదటి నీతికథల సంకలనంగా పేరుగాంచిన భారతీయ గ్రంథం ఏది? ఎవరు రచించారు?
4. అత్యధికంగా చదవబడే భారతీయ మతగ్రంథం ఏది?
5. ప్రాచీన భారతీయ సాహిత్యాన్ని నాలుగు దశలుగా విభజిస్తారు. అవి ఏవి?




నిబంధనలు :

1. చందమామ ఇండియా లిమిటెడ్, సంస్థలో ఉద్యోగం చేసే వాళ్ళూ/సంబంధించిన వాళ్ళూ, వాళ్ళ బంధువులూ ఈ పోటీలో పాల్గొనకూడదు.
2. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
3. దస్తూరీ స్పష్టంగా లేని ఎంట్రీలు స్వీకరించబడవు.
4. పోటీ ఫలితాలు చందమామ ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడతాయి.
5. సమాధానాలు జనవరి 31వ తేదీలోగా మాకు చేరాలి.

| | | |
|---|---|---|
| ఎ. భీముడు | - | శిశుపాలుడు |
| బి. జరాసంధుడు | - | కంసుడు |
| సి. భీష్ముడు | - | విచిత్రవీర్యుడు |
| డి. అశ్వత్థామ | - | కృపాచార్యుడు |
| ఇ. విదురుడు | - | శుకుడు. |

దేశ భాషలలో చందమామ ప్రత్యేకత!

# నిజమైన అద్భుతం!

ఒకరోజు సాయంకాలం ఒక వ్యాపారి అంగడి వీధిలోని తన దుకాణాన్ని కట్టేసి, ఆ రోజు వసూలైన మొత్తాన్ని చిన్న సంచీలో తీసుకుని ఇంటికి బయలుదేరాడు. ఆయన కొంతదూరం వెళ్ళి వీధి మలుపు తిరగేప్పుడు హఠాత్తుగా ఒక యువకుడు ఆయన చేతిలోని డబ్బు సంచీని లాక్కుని పరిగెత్తసాగాడు.

"దొంగ! దొంగ! పట్టుకోండి!" అని అరుస్తూ ఆ యువకుడివెంట పరిగెత్తాడు వ్యాపారి. ఆయనతో పాటు మరికొందరు కలిసి ఆ యువకుణ్ణి తరిమి పట్టుకుని కొత్వాలుకు అప్పగించారు.

"క్షమించండి, తెలియక చేశాను," అంటూ ఆ యువకుడు కొత్వాలు కాళ్ళపైబడి వేడుకున్నాడు.

"తెలియకచేశావా? దొంగవెధవా!" అంటూ కొత్వాలు పట్టరాని ఆవేశంతో ఒక తన్ను తన్నాడు. యువకుడు ఎగిరి దూరంగా పడ్డాడు. అంతే! దానినే గొప్ప అవకాశంగా భావించి యువకుడు ఒక్క గెంతున లేచి పరుగు లంకించుకున్నాడు.

కొత్వాలు భటులు వాడి వెంటబడ్డారు. అప్పటికే చీకటి కమ్ముకుంటున్నది. యువకుడు భటుల చేతికి పట్టుబడకుండా అడ్డదిడ్డంగా పరిగెత్తుతూ పట్టణం పొలిమేరను చేరుకున్నాడు. మరికొంత దూరంలో చిన్న అడవి వుంది. వాడు ఆ అడవిని సమీపిస్తూండగా వెనకనుంచి బలంగా అడుగుల చప్పుడు వినిపించింది. బాటకు ఎడమవైపున చిన్న కుటీరం కనిపించింది. కుటీరం నుంచి దీపం కాంతి బాటమీద పడుతున్నది. ఆ యువకుడు అప్పటికే బాగా అలిసిపోయాడు. తన శక్తినంతా కూడగట్టుకుని కుటీరం చేరుకోవడానికి ప్రయత్నించాడు. కాలికి ఏదో తగలడంతో కిందపడి తలకు బండరాయి గుద్దుకుని స్పృహకోల్పోయాడు. కొత్వాలు భటులు అటుకేసి వచ్చారుగాని, చీకట్లో వాడిజాడ తెలుసుకోలేక తిరిగి వెళ్ళిపోయారు.

కొంత సేపటికి కుటీరం నుంచి వెలుపలికి వచ్చిన ముని, స్పృహకోల్పోయి పడివున్న



యువకుణ్ణి చూసి, వాడి ముఖం మీద నీళ్ళు చల్లి లేపాడు. మెల్లగా కుటీరంలోపలికి తీసుకు వెళ్ళి తినడానికి ఫలాలిచ్చి సేదతీర్చాడు.

ముని కుటీరంలోనే కొంతకాలం వుండిపోతే కొత్వాలు భటుల బెడద వుండదని ఆ యువకుడు, "మహాత్మా! నేను ఇక్కడే వుండి తమ సేవలు చేసుకోవడానికి అనుమతించండి!" అన్నాడు అతి వినయంగా.

కరుణామయుడైన ముని ఆ యువకుణ్ణి తన శిష్యుడిగా అంగీకరించాడు. కొన్ని రోజులు గడిచాయి. ముని ఉపదేశాలు వినడంవల్లా, ఆయన జీవన విధానాన్ని దగ్గరవుండి పరిశీలించడంవల్లా ఆ యువకుడి మనసు క్రమంగా మంచి మార్గంలోకి మళ్ళసాగింది. వాడు మునికి శుశ్రూషలు చేస్తూ అక్కడే వుండిపోవాలనుకున్నాడు. మునికి నిజంగానే శిష్యుడై ధ్యానపద్ధతులు నేర్చుకున్నాడు.

కొన్నేళ్ళ తరవాత ముని కాలధర్మం చెందాడు. అప్పటికే శిష్యుడికి కూడా ప్రేమానందస్వామి అనే గొప్ప జ్ఞానిగా పేరువచ్చింది. చుట్టుపక్కల గ్రామాల నుంచి భక్తులు వచ్చి ఆయన్ను దర్శించుకుని ఆశీస్సులు పొందేవారు.

కొందరు శిష్యుల కోరిక మేరకు ఒక రోజు ఆయన పట్టణానికి వచ్చాడు. తన దర్శనానికి వచ్చిన భక్తులనుద్దేశించి ఆయన భగవల్లీలలను గురించీ, జీవితంలో జరిగే అద్భుతాలను గురించీ ప్రసంగించాడు. ప్రజల మధ్యే కూర్చుని ఆయన ప్రసంగం విన్న ఒక వృద్ధుడు అందరూ వెళ్ళిపోయాక ఆయన్ను సమీపించి పాదాలు తాకి నమస్కరించి, "మహాత్మా! నేను ఆ భగవంతుడి దరిదాపులకు రాగలిగితే అదే గొప్ప అద్భుతం. నేను పట్టణానికి కొత్వాలుగా పనిచేసి కఠినంగా ప్రవర్తించాను. క్రూరమైన జీవితం గడిపాను. నా జీవితంలోనూ దేవుడి దయకు



పాత్రమయ్యే అద్భుతం జరుగుతుందంటారా?" అని అడిగాడు.

"తప్పక జరుగుతుంది మిత్రమా! ఒకనాడు నేను దోషిగా నీ పాదాలపై బడ్డాను. ఈ రోజు నువ్వు నా పాదాలను స్పృశించావు. ఇదే ఒక అద్భుతం కాదా? ఒక దొంగ దేవుడి కరుణకు పాత్రమైనప్పుడు ఆ దొంగను శిక్షించిన కొత్వాలు దేవుడి కరుణకు పాత్రంకాకుండా పోతాడా?" అన్నాడు ఆయన మందహాసంచేస్తూ.

వృద్ధుడికి ఏమీ అంతుబట్టక వింతగా చూస్తూండిపోయాడు. అప్పుడు ఆయన గోవిందుడి పేరుతో అల్లరిచిల్లరగా తిరుగుతూన్న తనను ప్రేమానందస్వామిని చేసిన సంఘటనను గురించి ఏమాత్రం దాపరికం లేకుండా వృద్ధుడికి వివరించాడు.

వృద్ధుడు కన్నీళ్ళు కారుస్తూ ప్రేమానందస్వామి పాదాలకు మోకరిల్లాడు.




# పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యం అణచివేత

భారతదేశం 1947వ సం॥లో రెండుగా విభజించ బడింది. అధిక భాగం భారత దేశంగానే కొన సాగుతున్నది. విడిపోయిన చిన్న ప్రాంతం పాకిస్తాన్‌గా పిలువబడుతున్నది.

భారతదేశం ఏ మతాన్నీ దేశ అధికార మతంగా ప్రకటించలేదు. మనదేశం మతాతీత లౌకిక రాజ్యంగా కొనసాగుతున్నది. అయితే పాకిస్తాన్ 1956వ సం॥లో తనను ఇస్లామిక్ రిపబ్లిక్‌గా ప్రకటించుకున్నది.

స్వతంత్రం పొందిన సమయంలో ఉభయ దేశాలూ ప్రజాస్వామ్య దేశాలుగానే కొన సాగాలని సంకల్పించుకున్నాయి. క్రమబద్ధంగా ఎన్నికలు జరిపి తమనాయకులను నిర్ణ యించే అధికారాన్ని ప్రజలకే అప్పగించాలని ఉభయదేశాలూ నిర్ణయించాయి. ప్రజా స్వామ్యానికి అనేక బలహీనతలు ఉండవచ్చు. అయితే, ఆ బలహీనతలన్నిటినీ అధిగమించే అతిపెద్ద బలం—ప్రజాభిప్రాయమే ఆఖరికి జయించడం! కావాలనుకున్నప్పుడు ప్రజలు తమ నాయకులను శాంతియుత మార్గంలో మార్చుకోవచ్చు. అయితే అధికార దాహంగల నియంత దేశానికి పాలకుడయినట్టయితే హింస లేకుండా అతన్ని గద్దె దించడం చాలా కష్టం.

భారతదేశం లౌకిక రాజ్యంగా కొనసాగ డాన్ని మనం గర్వంగా చెప్పుకోవచ్చు. నిజానికి మనదే ప్రపంచంలో కెల్లా అతిపెద్ద ప్రజా స్వామ్యదేశం. అయితే, పాకిస్తాన్‌లో పరిస్థితులు దీనికి పూర్తిగా విరుద్ధమైనవి. 1958వ సం॥లో ఫీల్డ్ మార్షల్ అయూబ్‌ఖాన్ తిరుగుబాటు జరిపి అధికారాన్ని చేజిక్కించుకున్నాడు. అతడు రాజ్యాంగ శాసనాన్ని మార్చి, తానే నియంతృత్వ అధికారాలుగల అధ్యక్ష పదవిని చేపట్టాడు. అయితే 1969వ సం॥లో జనరల్ యాహ్యాఖాన్ తిరుగుబాటు జరిపి అతన్ని పదవీచ్యుతుణ్ణి చేశాడు.

1971వ సం॥లో యాహ్యాఖాన్ ప్రభుత్వం తూర్పుపాకిస్తాన్ (మొదట తూర్పు పాకిస్తాన్, ప్రస్తుతం బంగ్లాదేశ్) పై దారుణమైన అణచివేత చర్యలకు పాల్పడింది. లక్షలాది మంది తూర్పు పాకిస్తాన్ ప్రజలు హిందువులూ, ముస్లింలూ భారతదేశానికి శరణార్థులుగా వచ్చారు. అందువల్ల భారతదేశం తూర్పుపాకిస్తాన్‌లో జోక్యం చేసుకోవలసిన నిర్బంధం ఏర్పడింది. బంగ్లా ప్రజలమద్దతుతో భారత సేనలు ఢక్కాలో ప్రవేశించి, పాకిస్తాన్ సేనల దుండగాలనూ, దురహంకారాన్నీ అరికట్టవలసివచ్చింది. స్వతంత్ర బంగ్లాదేశ్ ఉదయించింది.

అవమానంపాలైన యాహ్యాఖాన్ అధి కారాన్ని రాజకీయ నాయకుడు భుట్టోకు

అప్పగించాడు. 1977వ సం॥లో ఏర్పడ్డ గందరగోళపరిస్థితిలో జనరల్ జియావుల్ హక్ అధికారం చేపట్టాడు. త్వరలోనే ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరిస్తానని వాగ్దానం చేసి ఆ తరవాత మాట మార్చాడు. భుట్టోపై హత్యకుట్రలో సహకరించాడనే నేరారోపణ చేసి ఉరితీయించాడు!

1988వ సం॥లో జియావుల్ హక్ ఒక విమాన ప్రమాదంలో హతుడయ్యాడు. ఎన్నికలు జరిగాయి. భుట్టో కుమార్తె, పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ నాయకురాలు బెనజీర్ భుట్టో ప్రధానమంత్రి అయింది. అయితే ఆమె ఎంతోకాలం అధికారంలో కొనసాగలేదు. ప్రెసిడెంట్ గులామ్ ఇజాక్ ఖాన్ ఆమెను పదవినుంచి తొలగించాడు.

1990వ సం॥లో జరిగిన ఎన్నికలలో ఇస్లామ్ జమ్‌హూరీ పార్టీనాయకుడు నవాజ్ షరీఫ్ అధికారంలోకి వచ్చాడు. 1993వ సం॥లో ఆయన్ను ప్రెసిడెంట్ తొలగించాడు. ఆ సంవత్సరమే జరిగిన మరొక ఎన్నికలలో బెనజీర్ భుట్టో అధికారం చేపట్టింది. ఆమె మళ్ళీ తొలగించబడి 1997వ సం॥లో నవాజ్ షరీఫ్ ప్రధానమంత్రి అయ్యాడు.

1999 అక్టోబర్ 12వ తేదీ ప్రధానమంత్రి చేత తొలగించబడిన సైన్యాధ్యక్షుడు జనరల్ పర్వేజ్ ముషారఫ్ హఠాత్తుగా తిరుగుబాటు జరిపి అధికారం హస్తగతం చేసుకున్నాడు. నవాజ్ షరీఫ్‌ను ఖైదుచేసి బంధించాడు. ఆయనమీద అనేక నేరారోపణలు చేసి విచారణ జరుపుతున్నాడు.

అసాధారణమైన ఈ మార్పు ప్రపంచ నాయకులకు ఆశ్చర్యం కలిగించింది. తన అధికార పరిధిలోనే షరీఫ్, సైన్యాధ్యక్షుడిపై చర్యతీసుకున్నాడు. ఒక అధికారిని తొలగించే హక్కు, అధికారం ప్రధానమంత్రికి ఉన్నాయి. అధికారి ఎంత పెద్దవాడైనా సరే, ప్రధానమంత్రిని తొలగించే అధికారం లేదు. ముషారఫ్ ప్రజాస్వామ్యానికీ, రాజ్యాంగానికీ విరుద్ధమైన హింసాత్మక చర్యకు పూనుకున్నాడు. షరీఫ్, ముషారఫ్ ఈ ఇద్దరిలో ఎవరు మెరుగు అన్నది ఇక్కడ ముఖ్యంకాదు. ప్రజాస్వామ్యానికీ, రాజ్యాంగానికీ హాని చేస్తున్న సైనిక అధికారిని సహించవచ్చా అన్నదే అసలు ప్రశ్న! ప్రపంచ అభిప్రాయం ముషారఫ్‌కు వ్యతిరేకంగానే ఉన్నది.



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ
వడపళని
చెన్నయ్-600 026





వ్యాఖ్యలను పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మార్చ్ నెల సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

## అభినందనలు



మే 98 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
ఎ. దుర్గాభవాని,
దోమల్‌గూడ, హైదరాబాదు-29



బహుమతి పొందిన వ్యాఖ్యలు
మొదటి ఫోటో: ఆకలేస్తోందామ్మా!
రెండవ ఫోటో: ఆడుకుంటానే అమ్మా!